# ధూర్జటి కవితా వైభవం

మధురమైన పద్యాలకు సుధారసవ్యాఖ్య



వ్యాఖ్యాత :

డాక్టర్ పి.ఎస్.ఆర్. అప్పారావు

ప్రచురణ



రిజిస్టర్డు నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

DHURJATI KAVITHA VAIBHAVAM

Selections from DHURJATI'S
Poetic Works with Commentary

By Dr. P. S. R. Appa Rao





యువభారతి

ప్రచురణ : 41





ప్రథమ ముద్రణ : ప్రతులు 3,200

4 జనవరి, 1976





ముఖచిత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : 2.00


---


PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES
YUVABHARATI IS GRATEFUL



# మా మాట

జగద్రక్షకుడైన ఆ విష్ణుమూర్తికీ పృథివీపతులైన తమకూ భేదమే లేదనుకుంటూ రాచరికాలు వెలయించుకుంటున్న రోజుల్లో వాళ్ళను ఖాతరు చేయక వాళ్ళ ఆశ్రమాలను కాలదన్ని స్వాభిమానంతో త్యాగమహితమైన జీవితాన్ని గడిపి తమ కవితా మహాత్మ్యంతో సమకాలీన ప్రజలను పునీతులను చేసిన వరకవులు తెలుగులో ఒకరో ఇద్దరో. ఆ ఇద్దరూ బమ్మెర పోతన, ధూర్జటి. ధూర్జటి రాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలలో ఒక్కడని కొందరు, కాదని మరికొందరు అభిప్రాయపడుతున్నారు. చరిత్రమాట ఎలా ఉన్నా ధూర్జటి బ్రతికింది 16వ శతాబ్దంలో. కాళహస్తీశ్వర మహాత్మ్యం, కాళహస్తీశ్వర శతకం అతడు తెలుగుజాతి కదించిన కవితా నిక్షేపాలు. పల్లీయుల జీవితాన్ని, ఆటవికుల బ్రతుకుల తీరుతెన్నులను ఎంతో పనితనంతో వర్ణించిన కవి ధూర్జటి. భక్తిరసబంధురమైన సుందర ప్రబంధం కాళహస్తీశ్వర శతకం తెలుగు శతకాల్లో పేరెన్నికగన్నది. భావశబలతకు, ధారాశుద్ధికి, భక్తిరసానికి, కవితా వేశానికి లక్ష్యభూతమైన శతకం ఇది. ధూర్జటి కావ్యసరస్వతితో పరిచయం లేనిదే తెలుగు సాహిత్యాధ్యయనం సంపూర్ణంకాదు.

డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు భరతుని నాట్యశాస్త్రాన్ని తెలుగువాళ్ళకందించిన రససిద్ధులు. తెలుగు నాటకాల ఉత్పత్తి వికాసాలను గూర్చి ఆయన చేసిన పరిశోధన విద్వల్లోకానికి కుపాదేయం. ప్రపంచ తెలుగు మహాసభలలో శ్రీ అప్పారావుగారు నిర్వహించిన పాత్ర ఆదర్శప్రాయం, అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టరుగా గురుతరమైన బాధ్యతను స్వీకరించి నిర్వహిస్తున్న కార్యదక్షులు. ఆయన కార్యదీక్షకు తెలుగు అకాడమీ మరో నిదర్శనం. ధూర్జటి కవితా వైభవాన్ని వ్రాసి మాకందించిన శ్రీ అప్పారావుగారి భాషాభిమానానికీ సాహిత్య ప్రణయానికీ కృతజ్ఞతా పూర్వకమైన అభివందనాలను సమర్పించుకుంటున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

4-1-76



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 40 ప్రచురణలను ప్రచురించి దాదాపు రెండు లక్షల యాభైవేల ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించటానికి పూనుకొన్నది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో లోగడ దాదాపు ఎనిమిది వేలమంది సభ్యులుగా ఉండేవారు, డిశంబర్ 1974 నుండి కొత్తరూపు దిద్దుకొన్న ఈ ప్రణాళికలో ఇప్పటికి 8,500 మందికి పైగా సాహితీమిత్రులుగా చేరారు. పాతసాహితీమిత్రులు కూడా ఈ పథకంలో చేరి, రానున్న ఉగాదినాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించడానికి ఆరంభింపబడిన శాశ్వత జీవిత పథకాలలో ఐదువందల మందికిపైగా భారతీమిత్రులుగా, యాభై మందికి పైగాభారతీభూషణులుగా చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం-ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని కోరుతూ —

4-1-76

అధ్యక్షుడు.



## సాహితీ వాహినిలో ఇంతవరకు వెలువడి అందుబాటులో ఉన్న తరంగాలు

| | | |
|---|---|---|
| 1. | మందారమకరందాలు | రు. 2=00 |
| 2. | వేమన్న వేదం | ,, |
| 3. | వడగళ్ళు | ,, |
| 4. | నాగొడవ | ,, |
| 5. | శ్రీనాథుని కవితావైభవం | ,, |
| 6. | విశ్వనాథ కవితా వైభవం | |
| 7. | సిందూరం | ,, |
| 8. | శిఖరాలూ-లోయలు | ,, |
| 9. | భావన | ,, |
| 10. | మెరుపులు | ,, |
| 11. | తిక్కన కవితా వైభవం | ,, |
| 12. | చేమకూర కవితా వైభవం | ,, |
| 13. | చలం ఆలోచనలు | ,, |
| 14. | భారతీ వైభవం | |
| 15. | తిమ్మన కవితావైభవం | |
| 16. | ధూర్జటి కవితావైభవం | ,, |
| 17. | తులసీదాసు కవితావైభవం | ,, |
| 18. | నన్నయ కవితావైభవం | ,, |
| 19. | ధర్మపథం | ,, |

# మాధురీ మహిమ

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేలగల్గెనో
యతులిత మాధురీమహిమ" నా మును మీ పెదతాత చాల
సన్నుతిఁ గనె, 'గృష్ణరాయల మనోజ్ఞసభ న్నీను మీవునట్ల మ
త్కృతబహుమాన వైఖరులఁగీర్తి వహింపుము ధాత్రిలోపలన్

కుమార ధూర్జటి రచించిన శ్రీకృష్ణరాయవిజయంలోని పద్యమిది. (1. 29). ఆరవీటి చినవెంకటరాజు (క్రీ. శ. 1680 ప్రాంతాలు) ఆస్థానకవి ఈ కుమారధూర్జటి. ఇతని అసలు పేరు వేంకటామాత్యుడు లేదా వేంకటార్యుడు; 'ధూర్జటి' వలెనే ఇతడును కవి కావడంవల్ల ఇతడును కూడా 'ధూర్జటి' గా ప్రసిద్ధిపొందినాడు, కాని, అసలు ధూర్జటికిని, ఇతనికిని భేదం తెలియటంకోసం ఇతనిని 'కుమారధూర్జటి' అనే వారు. పెదధూర్జటిని గూర్చి గ్రంథస్థం చేసిన ప్రథము డితడే. కుమారధూర్జటికిని పెదధూర్జటికిని సుమారు నూరుసంవత్సరాల అంతరం ఉంది. అందుచేత 'పెదతాత' అనగా 'తాతకు తాత' అనే అర్థం చెప్పినారు. శ్రీ చాగంటి శేషయ్యగారు (ఆంధ్ర కవితరంగిణి 7సంపుటము. పుటలు 247-54; 12సంపుటము. పుటలు 84-86). పెదధూర్జటిని గూర్చి "చాలా సన్నుతిఁగనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ" అని కుమారధూర్జటి చెప్పగా కుమారధూర్జటి కుమారుడగు ధూర్జటి లింగరాజుకవి పెదకాళహస్తి మహాత్మ్యంలో "కృష్ణరాయ కిరీట కలితమణి గణార్చిత పదాబ్జద్వయ శ్రీవహించి" అని లింగరాజుకవి కుమారుడగు వేంకటరాయకవి తన 'రత్నావళీ పరిణయం' లో "పాదవినమ్ర కృష్ణ వరరాడ్గంభీర కోటీరవిస్ఫుట రత్నద్యుతి పాటలీ కృత పదాంభోజజాతు" అని వర్ణించి నారు.

కాగా పెదధూర్జటి శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉండేవాడన్నది స్పష్టమవు తున్నది. పెద్దన్న, తిమ్మన్న, మల్లన్నలు కృష్ణదేవరాయల ఆస్థానము నలంకరించి రనుటకు సమకాలికములగు సాక్ష్యము లున్నవి. అట్టి సమకాలిక సాక్ష్యములు ధూర్జటి విషయంలో లేకపోయినప్పటికీ, కుమారధూర్జటి ప్రభృతుల ప్రశంసలను బట్టి, పరం

పరగా వినవస్తున్న జన[శుతిని బట్టి శ్రీ కాళహస్తి మాహాత్మ్యం [వాసిన పెదధూర్జటి రాయలవారి (క్రీ. శ. 1509-1580) అస్థానంలో, భువనవిజయం సభలో, అష్ట దిగ్గజ కవులుగా [ప్రసిద్ధులైన ఎనమండుగురు కవులలో ఒకడుగా మన్ననలుపొంది ఉండ వచ్చునని నిశ్చయింపవచ్చును.

శ్రీ కాళహస్తి మహత్మ్యంలోని ఆశ్వాసాంత గద్యనుబట్టి ధూర్జటి తల్లిపేరు సింగమఅనీ, తం[డిపేరు జక్కయ తనయుడైన నారాయణుడనీ తెలియవస్తున్నది. ఇంతకు మించి స్వీయవంశాది కములను గూర్చి ధూర్జటిఇంకేమీ చెప్పుకోలేదు. కృత్యాదిని స్వీయగురు ప్రశంస చేసినప్పటికీ, ఆ పేరు చెప్పనేలేదు. ఇంక కుమారధూర్జటి పేర్కొన్న దానిని బట్టి ధూర్జటి పాకనాటి ఆర్వేల నియోగి బ్రాహ్మణుడనీ, ఆపస్తంబ సూత్రుడనీ, భారద్వాజ గోత్రుడనీ, కాళహస్తి నివాసిఅనీ, కృష్ణరాయల సభను అలంకరించెననీ, తెలియవస్తున్నది. లింగరాజు, వెంకటార్యులు [వాసుకొన్న [వాతలను బట్టి వారి యింటి పేరు 'ధూర్జటి' అనే చెప్ప వచ్చును. ఇంతకూ ధూర్జటి ఇంటి పేరేదో తెలియదు. వేంకటగిరి సంస్థానంలో కారూరు, ధూర్జటి అమ్మపాళెము అనే గ్రామాలున్నవి. కారూరులో ధూర్జటి అనే ఇంటి పేరు గలవారు ఇప్పటికీ ఉన్నారు. ఇంక ధూర్జటి పూర్వులు. ధూర్జటి అమ్మపాళెము [గామవాస్తవ్యులై తరువాత కాళహస్తిలో స్థిరపడిఉండవచ్చుననీ [గామ నామమే ఇంటిపేరుకూడా అనీ, ధూర్జటి తన ఇంటి పేరనే రాయలవారి సభలో [ప్రసిద్ధుడై ఉండెననీ, తరువాత అదే ఇంటిపేరు కూడా అయి ఉంటుందని ఊహించటానికి అకావళం ఉంది.

ధూర్జటి ఎన్ని [గంథాలు [వాసినాడో, తెలియదుగాని, మనకు మిగిలినవి రెండు మాత్రమే-శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, శ్రీ కాళహస్తీశ్వర శతకము. ఇందులో శతకంతొలి రచన అని కొందరు విమర్శకులు అభిప్రాయపడి నప్పటికీ, మహాత్మ్యమే ముందరి రచన అని నా నమ్మకం.

ధూర్జటి వేశ్యాలోలుడని అతని స్వభావాన్ని గూర్చిన [ప్రవాదమొకటి లోకంలో వ్యాపించి ఉంది. పలువురు విమర్శకు లీ విషయాన్ని విశ్వసిస్తున్నారు కూడా. మహాత్మ్యంలోని కృత్యాదిని బట్టి ధూర్జటి తొలుత శ్రీ విద్యోపాసకుడని తెలియవస్తున్నది. శ్రీ విద్య సర్వవశీకరణ సమర్థము. కాని, ఆ ఉపాసకుడు నీతి నియమాలు తప్పి చరిస్తే పతితుడవుతాడు. ధూర్జటి ఇట్టి స్థితికి పాల్పడి ఉంటాడని ఈ విమర్శకులు అనుమానం. ఈ అనుమానానికి [ప్రబల హేతువు [కింది చాటువు—

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గెనో
యతులిత మాధురీ మహిమ......"

అని సభలో శ్రీకృష్ణదేవరాయలు ప్రశ్నించినాడట ! అంతట తెనాలి రామ లింగము (తరువాత రామకృష్ణుడు) లేచి,

............హా ! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపి హారి సం
తత మధురాధరోదిత సుధార సధారలు గ్రోలుటం జుమీ"

అని సమాధానమిచ్చినాడట ! ఈ సమస్యాపూరణమును పుక్కిటి పురాణమని త్రోసిపుచ్చుటకు వీలులేకుండా, ఇందులోని సమస్యాభాగాన్ని కుమారధూర్జటి గ్రంథస్థం చేసినాడు. అయితే ధూర్జటి కవితామాధురీమహిమకు హేతువు రామలింగము చెప్పినదేనా ! దీనిని విశ్వసింప వలసివస్తే వారవనితాధర సుధారస ధారలు గ్రోలిన మహానుభావులంతా మహాకవులే కావలసి ఉంటుంది. ఇది విశ్వసనీయం కాజాలదు. కొంటెతనానికి పేరొందిన రామలింగము చమత్కారంగా ఆ సమస్యనట్లా పూరించి, ఉంటాడు. రాయలవారు ధూర్జటి దానిని అట్లే గ్రహించి నవ్వుకొని ఉంటారు. అట్లాగే కథావశాన చెప్పిన అనేక విషయాలను కూడా కవికి అంటగట్టి కవి శీలాదులను శంకించడం న్యాయం కాజాలదు.

ధూర్జటి తన కవిత్వాన్ని దివ్యార్చనగా కూర్చి అందులోని 'మాధురీమహిమ'ను శ్రీ కాళహస్తిపతికి నైవేద్యం పెట్టుచున్నట్లు చెప్పుకొన్నాడు. నిజంగా, కవిత్వంలోని మాధురీమహిమ వల్లనే ధూర్జటి రాయలకు 'స్తుతమతి' అయినాడు.

ధూర్జటి కవిత్వంలోని మాధుర్యాన్ని పంచిపెట్టడానికి ప్రయత్నించాను. సహృదయులు స్వీకరిస్తే నాకృషి సఫలమైనట్లే. నాకు ఈ అవకాశాన్ని కల్పించిన యువభారతి కార్యకర్తలకు నా కృతజ్ఞతలు.

# ధూర్జటి కవితావైభవం

## 1

శ్రీ విద్యానిధియై, మహామహిమచేఁ జెన్నై, వసిష్ఠాజ లూ
తావాతాశన సామ జాటవిక గోత్రాదేవ నత్కీర రా
జీ వాక్షీయుగ యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన యా
ర్యావామాంగము, దివ్యలింగము మదీయాభీష్టము ల్సల్పెడున్

(I-1)

ఇది శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని తొలి పద్యం. ఈ పద్యంలో ధూర్జటి మంగళాచరణంతోపాటు ప్రబంధ కథా సూచన కూడా చేసినాడు. ఈ మహా ప్రబంధంలో వశిష్ఠుడు, అజుడు (బ్రహ్మ), లూత(సాలెపురుగు), వాతాశనము (పాము), సామజము (ఏనుగు) ఆటవికుడు (తిన్నడు) గోత్రాదేవుడు (హరద్విజుడు), నత్కీరుడు, రాజీవాక్షీయుగము (వేశ్యాతనయ లిరువురు); యాదవాధిపుడు (నారాయణవనపు రాధిపుడు)-వీరంతా పరమేశ్వర సాక్షాత్కారాన్ని, తదైక్యాన్ని పొందటం, ఇదే వరుసలో, వర్ణితమైనది. అందుచేతనే వసిష్ఠాజ ......... యాదవాధిపులకున్ శ్రేయస్కరంబైన" అని చెప్పటం జరిగింది. ఇట్లా భక్తులకు శ్రేయస్సు కలిగించే దైవమునుకూడా వర్ణించినాడు ధూర్జటి. శ్రీకాళహస్తీశ్వరుడు శ్రీవిద్య (పరావిద్య) కు నిధి అయినవాడు, మహామహిమాన్వితుడు, పార్వతీదేవి వామాంగముగా కలవాడు, దివ్యలింగ స్వరూపుడు. ఇటువంటి దేవోత్తముని "మదీయాభీష్టము ల్సల్పెడున్" అని ప్రార్థించినాడు ధూర్జటి.

ప్రబంధ ప్రథమాశ్వాసంలో శ్రీకాళహస్తిపుర వర్ణన కావించేటప్పుడు మరల కొంత కథా సూచన జరిగింది..."......కీటమునకైనం; జక్రికైన, న్మదాంధునకైనన్, బహూ జీవహంతకయినన్ దుర్వాసనం బాపి మోక్షనిధిం గొల్లగొనంగ

వచ్చునఁట......" (20 ప.), ఇందులో వరుసగా సాలెపురుగు, ఏనుగు, ఆటవికుడు సూచితమైనారు. ప్రబంధ ప్రారంభంలో చేసినట్లే ప్రతి ఆశ్వాస ప్రారంభంలోను కథా సూచన చేయటం ధూర్జటి రచనలోని ఒక విశేషం. ద్వితీయా శ్వాస ప్రారంభ పద్యం ఇట్లా ఉంది :

శ్రీఖండాచల మారుత, లేఖా స్పర్శాది విషయ లీఢాకృద్వి
ద్యాఖని ! మునిజన కల్పక, శాఖీ ! శ్రీకాళహస్తిసదన ! మహేశా!

'విద్యాఖని' అనటంలో బ్రహ్మ, 'మునిజనకల్పక' అనటంలో శ్రీ-కాళ-హస్తులు సూచితములు. కాగా, ద్వితీయాశ్వాసంలో వీరి కథలే వర్ణితములైనవి. ఇట్లే తృతీయా శ్వాస ప్రారంభంలో తిన్నని కథ, నత్కీరుని కథ, చతుర్థా శ్వాస ప్రారంభంలో వేశ్యాతనయల కథ సూచితములైనవి.

ఇట్లా ఆశ్వాస ప్రారంభంలోనే కాక ఆశ్వాసాంతంలో కూడా ముందరి కథా సూచన చేయబడింది. వసిష్ఠుని, అగస్త్యుని [బ్రహ్మర్షుల] కథలను విన్న వీర నరసింహ యాదవుడు భర్గునకుం గమ్రముఅ మొక్కి "భక్తనిధీ! నాకుఁజెప్పవే విశ్వనాథుని యారాధనసేసి యగ్గిరిని జంతుశ్రేణిలో ముక్తిఁగోరిన యర్థంబులు గాంచి రెవ్వ" రని ప్రశ్నించినాడు, ప్రథమా శ్వాసాంతమున వేయబడిన ఈ ప్రశ్నకు సమాధానముగా తరువాతి (రెండవ) ఆశ్వాసంలో జంతుశ్రేణికి చెందిన శ్రీ-కాళ-హస్తుల కథలు వర్ణితములైనవి. ఇట్లాగే తక్కిన ఆ శ్వాసాంతాలలో కూడ రచనసాగింది.

శివభక్తులను గూర్చిన కథలను శివుని చేతనే చెప్పించటం ధూర్జటి రచనలోని ఇంకో విశేషం, నారాయణవనపురాధిపతి అయిన వీరనరసింహ యాదవుని భక్తిని తెలుసుకొనగోరి, శివుడు మాయాజంగమ స్వరూపంతో వచ్చి, ఒక దాసి ఇంట విడిదిచేసినాడు. రాజు భోజన సమయంలో స్వయంగా పళ్ళెము సిద్ధం చేయటం ఆమె నిత్యకృత్యం. కాని, ఆనాడు తపసితగులమున ఉండటంచేత ఆమె ఆ విషయాన్నే మరచినది. రాజు ఆగ్రహంతో ఆమె తల గొరిగింపజేసినాడు. కాని, మాయాజంగమ స్వరూపుడైన శివుడు హస్తమస్తక సంయోగ మాచరింపగానే ఆమెకు మరల జుట్టు సంపూర్ణంగా వచ్చింది. అది విని, ఆశ్చర్యపడి, రాజు సపరివారంగా ఆమె ఇంటికి వచ్చి, జంగమ లింగమును పూజించి ప్రసన్నుని చేసుకున్నాడు. అప్పుడు శివుడు "కలధౌతశైలశిఖరాలయ గేహమును కట్టింపు" మని రాజును కోరినాడు

రాజు అందుకు అంగీకరించి "తదాదిపురాణ కథా ప్రసంగముల్ వినవలతు, సవిస్తరవై భరింజెప్పవే" అని ప్రార్థించినాడు అప్పుడు శివుడు స్వయంగా శివ భక్తుల కథలను వరుసగా వినిపించినాడు.

## 2

ఈశుభకార్య రత్నమున కీశు నధీశునిఁ జేసినన్, మహా
దేశిక సార్వభౌముఁడు ముదంబ్రమదంబు వహించి, "ధూర్జటీ!
నీ శివభక్తి కావ్యసరళింగడు ధన్యతఁబొంద నవ్యభా
షా శతధానిగుంభనరసస్థితి నొప్పు దలిర్పఁ జెప్పుమీ".

[I-8]

శ్రీకాళహస్తి మాహాత్మ్యం అనే మహా ప్రబంధ నిర్మాణానికి దొరకొన్న ధూర్జటి, మనస్సులో తన "కృతికన్యా రత్నమునకు విద్యా పారంగతుఁడైన వరునిఁ బరికించి", "చేతో గమ్యుండగు కాళహస్తి పతిని నాథునిగా" ఎన్నుకొన్నాడు. ఇందుకు సంతోషించిన మహాదేశిక సార్వభౌముడు "ధూర్జటి ! నీ శివభక్తి......... ఒప్పుఁదలిర్ప జెప్పుమీ" అని అనుగ్రహం చేసినాడు. పోతనామాత్యుడు రాజాశ్రయాన్ని అర్థించనూలేదు, తన కృతి కన్యను నరాంకితం చేయనూలేదు. కాని, ధూర్జటి రాజాశ్రయంలో ఉండి కూడా, తన కృతి కన్యను పరమేశ్వరాంకితం చేసినాడు ఆనాడు ఇందుకు కొంత మనస్థైర్యం కావలసి ఉంటుంది; ఆ స్థైర్యాన్ని గురువు-మహాదేశిక సార్వభౌముడు (ధూర్జటి పేరు చెప్పలేదు)-ఇచ్చి, నీ శివభక్తి కావ్య సరళింగడు ధన్యత బొందించుకొమ్మనినాడు.

కావ్యానికి 'ఆత్మ' రసమని ప్రాచీనాలంకారికుల నిర్ణయం. ఆ రసం, ప్రతీయమానమైనప్పుడే అంటే ధ్వనించినప్పుడే అది లోకోత్త రాహ్లాదజనక సమర్థ మవుతుంది. అందుచేతనే 'రసధ్వని' కావ్యాత్మ అని అర్వాచీనాలంకారికులు నిర్ధ రించినారు. ఈ రసధ్వనినే 'నిగుంభనరసస్థితి' అన్నాడు ధూర్జటి. ఇంక ధ్వని భేదాలు శతధా అంటే వందలకొలది ఉన్నాయి; కాగా రసం శతధా ప్రతీయ మానం మవుతుంది, అటువంటి రసస్థితిని 'నవ్యభాష'లో వెలయింపుమని గురుని ఆదేశం. కావ్యానందం బ్రహ్మానంద సహోదరం కదా ! యోగసాధనచేత బ్రహ్మానంద స్థితిని పొందిన గురుడు, ఆ స్థితిని పొందటానికి ముందుగా, 'కావ్యసరళింగడు ధన్యత'ను

అంటే కావ్యనిర్మాణంద్వారా ఆనందాను (రసాను)భూతిని పొందుమని శిష్యుని ఆదేశించినాడన్నమాట.

ధూర్జటి కావ్యారంభంలో శ్రీకాళహస్తిపురాన్ని వర్ణించినాడు. పురవర్ణన చేసిన పది పద్యాలలోను ధూర్జటి గతానుగతికంగా-పురస్వరూపము, అందులోని సౌధాలు, ప్రాకారాలు, ఎలదోటలు, అగడ్త, చాతుర్వర్ణ్యము, కామినీజనులు, చతురంగ బలము మొదలైన వాటినే-వర్ణించినప్పటికీ, అన్నింటనూ శివభక్తిని, శివపారమ్యాన్ని, ఐహికవాంఛావిరక్తిని, యోగసాధనను, శాంతత్వాన్ని, శివైక్యాన్ని ధ్వనింప జేసినాడు. అంతేకాదు, ప్రబంధమంతటా తటాకాలనూ, సముద్రాలను, సూర్య చంద్రాదులను-ఒకటేమిటి-సర్వజంగమ స్థావర ప్రపంచాన్ని శివమయంచేసి వర్ణించి నాడు. ఇదే మహాదేశిక సార్వభౌముడు ఆదేశించిన 'నవ్యభాషా రచన' మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణలు పరిశీలించవచ్చు.

3

ఉదయగ్రావము పానవట్ట, మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి, దరీధ్వాంతము ధూపధూపము, జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్పిత సుమంబుల్ గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తి బింబ శివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్.

(II-188)

ఇది చంద్రోదయవర్ణన, చంద్రోదయాన్ని వర్ణించని కవి లేడంటే అతిశయోక్తి కాదేమో ? అయితే, తక్కిన కవుల వర్ణనలకు, ధూర్జటి వర్ణనకు ఎంతో తేడా ఉంది. చంద్రుని శివలింగస్వరూపునిగానే వర్ణించినాడు ధూర్జటి. ఉదయపర్వతం-పానవట్టం, సముద్రం- అభిషేకోదకం, కొండగుహాలలోని చీకటి ధూపధూమము, వెన్నెల-వెలుగుతున్న దీపముల కాంతిపుంజం, తారకలు పుష్పాలు-కాగా చంద్రుడనే శివలింగం తూర్పు దిక్కున ఒప్పినాడట ! భీమేశ్వర పురాణంలో శ్రీనాథుడుకూడా ఉదయిస్తున్న సుధాకరబింబాన్ని కాశ్మీర శంభులింగంగా వర్ణించినాడు

(II-42)

కాదుకా దుదయాద్రి కనకకూటం బిది
డంబైన పానవట్టంబుగాని
కాదుకాదిది సుధాకరపూర్ణబింబంబు
కాశ్మీర శంభులింగంబుగాని
కాదుకా దుదయరాగ ప్రకాశం బిది
నవకుంకుమా లేపనంబుగాని
కాదుకాదిది కళంకచ్ఛటారించోళి
పూజచేసిన కల్వపువ్వుగాని

యనఁగ సప్తార్ణవములు మిన్నంది కొనఁగఁ
జంద్రకాంతోపలంబులు జాలువారు
నసమశర సార్వభౌము ముత్యాలగొడుగు
విధుఁడు విశ్వంబు వెన్నెల వెల్లిఁదేల్చె"

శ్రీనాథుని వర్ణనలో ఏమూలనో కొంచెం అనుమానం తొంగిచూస్తున్నట్లున్నది. కాని, ధూర్జటి నిస్సందేహంగా, తెగవేసి చెప్పినాడు–'శీత గభస్తిబింబ శివలింగంబు' అని, అసలు, ధూర్జటికి శ్రీకాళహస్తిలోని చరాచర జగత్తు సర్వమూ శివమయమే. ఆపట్టణ వైభవమంతా ప్రతిబింబిస్తున్న చంద్రకాంతరచితప్రాకారం లోకాలను కుక్షిలో ధరించిన శివుని విధంగా ఉన్నదట; అచ్చట నివసిస్తున్న ప్రాణులకు అప వర్గ రమాసతి (మోక్షలక్ష్మి) ని చేపట్టటంలో సమతయే కాని ఉత్తమాధమ మధ్యత్వాలు లేవట; కామినీజనులు యోగిజనంబుల పోలికతో నుందురట; గంధ మంధర దంతావళి కోటి అవధూతప్రక్రియతో ఒప్పుచున్నవట; రాజసభలో భంగపడిన శివదాసియేడ్పు శివార్చన యట. ఇంత ఎందుకు, శ్రీకాళహస్తిపురంలో—

ఎలదోఁటల్వనము, ల్వధూకుచములద్రీంద్రంబు, లాకంటికిన్
ఫలము ల్వాతెర, లంగజాగమ కళాబంధంబు లిచ్చాసనం
బులు కోపనంబునఁ బాయుటల్ తపము సంభోగంబు కైవల్యమం
ధుల లీలారతినుండు మానవుల కెందుం గానమీ చిత్రముల్, (I-81)

"దక్షిణగంగనాఁ దద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీ
పర్వతంబునుజూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచువేఁగీ దేశ
విభవంబుఁ జూచుచు......"

(ఆది.పర్వ-VIII. 139)

ఇటువంటప్పుడు స్వీకరించిన క్షేత్రం తెలుగుదేశానికి సంబంధించిందీ, తనకు ప్రాణప్రదమైనదీ అయినప్పుడు ఇంక కవివిజృంభణకు అడ్డుఏమి ఉంటుంది? కావుననే శ్రీనాథుడు భీమేశ్వరపురాణంలో, పరవశుడై, తెలుగుసీమను మనసారా వర్ణించినాడు. భీమేశ్వర పురాణంలోని దక్షారామంవలెనే, పాల్కురికిసోముని పండితారాధ్య చరిత్రలోని శ్రీశైలంవలెనే, ఈ ప్రబంధంలోని శ్రీకాళహస్తికూడా తెలుగుదేశపు శైవక్షేత్రం ఈ పద్యంలో శ్రీకాళహస్తి వైశిష్ట్యాన్ని సాక్షాదీశ్వరుని చేతనే చెప్పించినాడు ధూర్జటి శ్రీకాళహస్తిపురం సంసారమనే పాదరసానికి అగ్నిజ్వాల, పాపాలు అనేరాగికి గంధకం, కామమనే తీగయొక్క దుంపకు కుద్దాలం, సంకల్పమనే ప్రీతికి ఉలి, రాగమనే వరిచేని మొలకకు గోమహిషాది పశురూపము, సందేహకళంకమనే పామునకు ముంగిస. కొత్తమనస్సు అనే ఆఖోతునకు ముక్కుత్రాడు. కోపనయొక్క చూపులనే బాణాలకు డాయి అంటే శ్రీకాళహస్తిపురంలో నివాసంరాగ ద్వేషాదులన్నింటినీ నశింపజేస్తుందన్నమాట. ఇంతవరకు వ్యతిరేకమార్గంలో వర్ణన జరిగింది. ఇంక తేటగీతిలో అనుకూలమార్గంలో చెప్పటం జరిగింది. దేవతాస్వరూపుడైన దేశికుడనే పరమహంసచేత ఉపదేశింపబడిన మార్గంలో నిర్గుణస్వరూపధ్యాన - అనుసంధానంచేత సాటిలేని సౌఖ్యసంపదను సాధించే జనులకు నివాసమైనది. అమృతమయలింగమునకు నెలవయినది శ్రీకాళహస్తిపురం. అంతమహిమకలది గావుననే తక్కిన "పురముల్ కొండాట కర్హంబులే" అనీ, "తత్పురముసాటిగ నన్యపురంబులెన్నఁ గానమరునటన్న హస్తిమకకాంతరమింతియవాసిచూచినన్" అనీ ధూర్జటి పేర్కొనటం జరిగింది.

# 6

"ఓ వెఱ్ఱీ! సుతు లందఱుం దెగిన, నయ్యో! దుఃఖివై యీగతిన్
జావం బుట్టువు దీఱునే? మనములో సంసారమున్ రోసినన్
దేవోత్తంసునిఁ బార్వతీరమణు భక్తిం గొల్వుమీ, చేకుఱున్
జీవన్ముక్తి" యటంచు ధాత్రి యుపదేశింపం బ్రమోదంబునన్.

(i-69)

బ్రహ్మర్షి అయిన వసిష్ఠునితో భూదేవి చెప్పిన మాటలివి. దుఃఖితుడైనప్పుడు బ్రహ్మర్షి కూడా వెఱ్ఱివానితో సమానమే. విశ్వామిత్రునితోఁడి తగవు ఫలితంగా తన నూర్గురు సుతులు చనిపోగా వసిష్ఠుడు దుఃఖితుడై, ఆత్మహత్యకు పూనుకొని; కొండ ఎక్కి క్రిందికి దూకినాడు. కాని వసిష్ఠుడు క్రిందపడకుండా బంతివలె పట్టుకొని, భూదేవి ఇట్లా చెప్పింది - చావువల్ల పుట్టువుతీరుతుందా? పార్వతీరమణుని భక్తితో సేవిస్తే జీవన్ముక్తి లభిస్తుంది. అని, వసిష్ఠుడు తెలివితెచ్చుకొని, గజకాననంలో అత్యుగ్రమైన తపస్సు చేసినాడు. ఆ తపస్సునకుమెచ్చి, శివలింగరూపమున పశ్చిమాభిముఖుండై ప్రత్యక్షమైన శివుడు "ముని చూడామణి" అని సంబోధించి, ఆతని కోర్కెలు తీర్చి నాడు. బ్రహ్మవిద్యనొసంగుమనీ, ఆశివలింగరూపమున కలకాల మచ్చటనే వసింపు మనీ వసిష్ఠుడు కోరినాడు; శివుడనుగ్రహించినాడు. పరమేశ్వరికూడా తదీయ సన్నిధిని నిల్చి, జ్ఞానప్రసూనాంబగా ప్రసిద్ధిపొందినది. పార్వతీపరమేశ్వరులు, సపరివారంగా, ఆ వనంలో, ఆ గిరిమీద విహరింపసాగిరి. ఆ క్షేత్రమే దక్షిణకైలాసమనబడు శ్రీకాళ హస్తి. లోపాముద్రాసహితుడై దక్షిణకైలాసమునకు విచ్చేసిన అగస్త్యుడు, శివుని అర్చించి, అచ్చట పుణ్యనదీప్రవాహంలేని లోపాన్ని తీర్పదలచి, అత్యుగ్రమైనతపస్సు చేసి, బ్రహ్మ అనుగ్రహంవల్ల, ఉత్తరముఖంగా సువర్ణముఖరీ నదిని ప్రవహింపజేసినాడు. ఈ విధంగా ఉత్తరముఖమైన నదితో, శివునికి నివాసమైన శ్రీకాళహస్తి నిజంగా 'అవిముక్త' (కాశీ) క్షేత్రమే.

7

తల్లిఁ గానని లేడిపిల్లలకుఁ జన్నిచ్చి
 పెంచు బెబ్బులి తనబిడ్డయట్లు
దైవికంబున గూఁడుదప్పి నేలను బిడ్డ
 రాచిల్క బోదలఁ బ్రోచుఁ బిల్లి
యెండచేఁ గ్రాఁగిన కొండగోటియఁ దెచ్చి
 యెలమావి నీడల నిలుపుఁ గ్రోఁతి
యెడఁ బాసి పోయిన పిడియేనుఁగులఁ గూర్చి
 కరి విరహంబు కేసరి హరించు

స్తనితముల కెగఁబడి వచ్చు శరభములను
బట్టి యొయ్యన ధాత్రిపైఁ బెట్టికాచు
గండభేరుండ పక్షులు గలిగి యజుని
యాశ్రమము శాంతరసరూప మయ్యెనపుడు. (2 - 71)

ఇంతకుముందు బ్రహ్మర్షులతపోవర్ణనం చేసినాడు. ధూర్జటి; ఇప్పుడు బ్రహ్మ తపస్సునే వర్ణిస్తున్నాడు. మహర్షుల ఆశ్రమాలు శాంతికి ప్రతిరూపాలు. కణ్వమహర్షి ఆశ్రమంలో సహజ వైరివర్గాల సహవాసాన్ని వర్ణిస్తూ తెలుగు సాహిత్యంలో ఇటువంటి వర్ణనలకు నన్నయభట్టారకులు శ్రీకారం చుట్టారు (ఆదిపర్వం - 5-24)

శుకాలుచేస్తున్న శ్రవణసుఖమైన సామగానం వింటూ ఏనుగులు నిలుచున్నవి; ఆ ఏనుగుల తొండాలనుంచి వెలువడుతున్న తుంపరులతో కూడిన చల్లని నీడల కాళపడి సింహాలు సుఖంగా పరున్నవట. భూతబలులకై బ్రాహ్మణులు వేసిన పిండాలను తిన టానికి వచ్చి, ఎలుకలు, పిల్లులు ఒక్కటిగా ఆడుకుంటున్నవట. సహజ వైరివర్గాల సహవాసాన్ని చూచి మునిశక్తికి దుష్యంతుడు ఎంతో చోద్యమందినాడట; నన్నయ తరువాతి కవులుకూడా ఇటువంటి వర్ణనలు అనేకం చేశారు; అయితే ధూర్జటి వర్ణనలో ఒక ప్రత్యేకత గోచరిస్తుంది. తక్కిన కవులు సహజీవనాన్ని మాత్రమే వర్ణించగా ధూర్జటి సహకారాన్నికూడా వర్ణించినాడు. తల్లి కనిపించక అలమటిస్తున్న లేడిపిల్లలకు బెబ్బులి చన్నిచ్చి తనబిడ్డవలె పెంచుతున్నదట. దైవికంగా గూడుతప్పి నేలబడిన చిలుక పిల్లలను పిల్లి కాపాడుతున్నదట. కోతి, ఎండలో కాగిపోతున్న కొండగొఱ్ఱెను

తీసుకొనివచ్చి గున్నమామిడి నీడలో నిలుపుతున్నదట. దూరమైపోయిన ఏనుగుల జంటను మరల ఒకచోట చేర్చి, సింహం వాటి విరహాన్ని పోగొట్టుతున్నదట. గండభేరుండ పక్షులు, ఉరుముల కెగబడి వచ్చిన శరభ మృగాలను మెల్లగా నేలపై నిలిపి రక్షిస్తున్నవట. ఈ విధంగా జంతుజాలంకూడా సహజవైరం మరచి, పరస్పరం సహకరించుకొంటున్న ఆ ఆశ్రమం శాంతరసరూపం కావటంలో ఆశ్చర్యం ఏముంది ? పైగా, అది సృష్టికర్త అయిన అజుని ఆశ్రమం కదా.

వసిష్ఠుడు, అగస్త్యుడు, బ్రహ్మ, అర్జునుడు - ఈ నలుగురూ ఆశ్రమాలు ఏర్పరచుకొని, శివునిగూర్చి తపస్సుచేయటం ఆయా సందర్భాలలో వర్ణించాడు ధూర్జటి. ప్రబంధంలో విధాయకమైన అష్టాదశవర్ణనలలో ఋష్యాశ్రమ వర్ణన ఒకటి. కాని, తప్పనిసరిగాచేసిన వర్ణనలుకావివి; ఇందులో ఏదో ఒక ప్రత్యేకత గోచరిస్తూనే ఉంటుంది. ఇందుకు ఇంకో రెండు ఘట్టాలు—

"దావానేకపముల్ గరాపహృత పాథః పూరము ల్దెచ్చి, యి
చ్ఛా వృత్తిం జలకంబులార్పఁ, జమరీజాలంబు వాలంబులన్
వీవం, గ్రోతులు పండ్లు గానుకలు గావింపఁ, గిరాతాంగనల్
సేవల్సేయ, జెలంగె నమ్ముని తపస్సింహాసనాసీనుఁడై (1 - 71)

వసిష్ఠుడు తపస్సు అనే సింహాసనమునం దాసీనుడై ఉండగా, అడవియేనుగులు అభిషేకిస్తున్నవి ; చమరీమృగాలు వింజామరలు వీస్తున్నవి ; కోతులు పండ్లకానుకలు పెట్టుతున్నవి ; కిరాతాంగనలు సేవలు చేస్తున్నారు. ఈ విధంగా మునిరాజునకు రాజోపచారాలు అయత్న సిద్ధాలైనవట!

"ఫలములఁ గాచు నద్రిసుతపాణిశుకంబు, వృషంబుఁగాచు శా
ద్వలములఁ, గాచు దంతిముఖ వాహన మక్షతరాజిఁ, గాచు జో
గులయిలువేల్పు వాజిమదిఁ గోరక బోనము - భక్తులీశ్వరుం
గొలిచినదాఁకఁ దత్కుధరకూటగళత్తటినీ తటంబులన్. (iv-154)

పూజ పూర్తిఅయ్యేవరకు పూజాసామగ్రిని పవిత్రంగా కాపాడుకొనటం అవసరం. మరి, కైలాసగిరిమీద ఉండే దివ్యవాహనాలకు పూజాసామాగ్రియే ఉచితమైన ఆహారం. అయినప్పటికీ శివపూజపూర్తి కానిదే తాము ఆహారం గ్రహించటంలేదు సరికదా, ఇత

రులుకూడా ఆ ఆహారం ముట్టకుండా కాపాడుతున్నవట. జంతుజాలమే ఇట్లా నిష్ఠతో ఉంటే ఇంక తక్కినవారి నిష్ఠనుగూర్చి చెప్పేందు కేముంది?

ఇంతటి మహా మహిమోపేతమైన శ్రీకాళహస్తిపురానికి, ఈ పేరెట్లావచ్చింది? అన్న జిజ్ఞాస కలగటం సహజం. సాలెపురుగు (= శ్రీ), పాము (= కాళము), ఏనుగు (= హస్తి) — ఈ మూడింటికి కైవల్యమిచ్చి, తనలో కలుపుకొనటంచేత గౌరీశుడు శ్రీకాళహస్తి పతిఅయినాడు. ఆయనకు నివాసమైనది శ్రీ కాళహస్తిపురము. అయితే ఈ కథలు విన్న యాదవరాజుకు ఒక సందేహం కలిగి, ఈశ్వరునితో ఇట్లా విన్న వించినాడు-

"తపము లొనరించి, పుణ్యతీర్థములు దిరిగి,
వ్రతము లన్నియుఁ జేసినవారు, శివుని
నెఱుఁగ, రీచెలఁ దీపాము నిభము నెఱుకు
లెఱిఁగి పూజించి ముక్తులై రెట్లనంగ?" (4-137)

అప్పుడు శివుడు పూర్వజన్మ కథలను కూడా విశదీకరించినాడు.

## 8

ప్రాతఃకాల తుషారశీకరచయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసఁగు, దద్బిందుచ్ఛటా జాతభ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహుళరత్నోద్దీర్ణ గేహంబులై
లూతాకల్పిత తంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై

(2-97)

కృతయుగంలో ఒక సాలెపురుగు (ఊర్ణనాభము = లూత; చెలది = శ్రీ) పూర్వ జన్మ సంస్కారబలంవల్ల దేవదేవుని భక్తురాలైనది; అంతేకాదు దీని భక్తిమార్గం చాలా విచిత్రమైనది. స్వర్ణముఖరీ నదీజలాలతో తడిసిన తన శరీరంనుంచి వెలువడే దారపు పోగులతో. గృహకల్పన శిల్పకళా ప్రవీణత ఉట్టిపడేటట్లుగా ప్రాకారాదులు, భవనాలు, కొలువుకూటాలు, అంతఃపురాలు, నర్తన మందిరాలు మొదలైనవి గజముఖాది సర్వ దేవతలకు ఏకాగ్రచిత్తంతో కట్టినది. ఆ సాలెపురుగు కట్టిన భవనాల శోభను రక్ష

ణీయంగా చిత్రించినాడు ధూర్జటి- ప్రాతఃకాలంలో ఆ భవనాలపై మంచుబిందువులు పడినవి. వాటివల్ల అవి ముత్యాలతోకూడిన భవనాలవలె అందగించినవట! కొంత సేపటికి ఆ మంచుబిందువులమీద సూర్యకిరణాలు పడినవి. అప్పు డాభవనాలు రత్న ఖచితాలైన భవనాలవలె ప్రకాశించినవట!

ఆ సాలెపురుగు భక్తిని పరీక్షింపగోరి. అది కట్టిన భవనాలన్నిటిని గుడిలోని దీపశిఖిచేత కాల్చివేసినాడు శివుడు. పట్టరాని కోపంతో చెలది ఆ దీపశిఖిని త్రాగివేయ బోయింది. అట్లా చావవచ్చిన పుర్వును చేతితో పట్టుకొని రక్షించి, శివుడు అదికోరిన విధంగా కైవల్యమిచ్చినాడు. శ్రీకాళహస్తిలోని 'శ్రీ' ఈ సాలెపురుగు. ఒకప్పుడు విశ్వకర్మ పుత్రుడగు ఊర్ణనాభుడు బ్రహ్మను ధిక్కరించి, సృష్టికి ప్రతిసృష్టి చేసినాడు అందుకు కోపించి, "నీ పేరుగల పురుగుగా జన్మించు" మని బ్రహ్మ శపించినాడు. ఆ ఊర్ణనాభుడే ఈ ఊర్ణనాభము ; ఈ విధంగా శాపాంతమేకాదు, కైవల్యమే లభించిలది. అందుచేతనే "అలిగి పఱపుపైఁ బడినగతియయ్యె" అని శపించిన తరువాత శాంతచిత్తుడైన బ్రహ్మ ఊర్ణనాభుని ఊరడించినాడు. (4-146)

## 9

ఎక్కడి దుర్మదుండో, తనకే నొనరించిన రత్న పూజనల్
దిక్కులఁ జాఱఁజల్లి, జగతీరుహ శాఖలుఁ దమ్మికాడలున్
బెక్కులు గొంచువచ్చి పయిఁబెట్టిన సూరకయుండె శంకరుం
డక్కట! మేమి సెప్ప ? నహాహా! పగవారిని గూడె దైవమున్.

(2-116)

త్రేతాయుగాంతంలో ఒక నల్లత్రాచు పాతాళంనుంచి దివ్యమాణిక్యాలను తెచ్చి ప్రతిదినం ప్రాతర్వేళలలో బాలేందుచూడామణిని పూజిస్తుండేది. అట్లాగే ద్వాపర యుగ ప్రారంభంలో ఒక హస్తిశ్రేష్ఠముకూడా ఆ బాలేందు చూడామణినే అర్చింప సాగినది. నల్లత్రాచు సమర్చించిన మాణిక్యాలను అవలకు త్రోసివేసి, తొండంతో పీల్చి తెచ్చిన తోయాలతో భక్తిపూర్వకంగా శివలింగాన్ని స్నానంచేయించి, తీసుకొని వచ్చిన మారేడుశాఖలను, ఎఱ్ఱదామరలను, నల్లగలువలను సమర్పించి, ఆ ఏనుగు వెళ్ళినది. మరునా డుషఃకాలాన పాపఱేడు వచ్చి, ఎవడో తనపూజను వ్యర్థంచేసి ఝుండ్లకంపలు శివునిమీద పెట్టిపోయినందుకు విషాదంపొంది, ఏనుగు సమర్పించిన వాటి

నెల్ల త్రోసివేసి, మణులతో యథావిధిగా గౌరీవల్లభుని పూజించి వెళ్ళినది. అంతకొంత సేపటికి ఆ గజరాజు వచ్చి, పెక్కు వర్ణాల జాలతో కపర్దికి చేయబడిన ఎకసక్కెపు పూజకు చింతిస్తూ, ఎప్పటివిధంగానే తన శివపూజ కావించి వెడలినది. మరునాడు ప్రభాత సమయంలో శివపూజచేయడానికి వచ్చిన కృష్ణసర్పము, మారేడుకొమ్మలతో కూడిన పద్మనాళాల క్రింద అణగిఉన్న శివలింగాన్ని చూచి, మనస్సులో చాల బాధ పడినది. తనది వృథా జన్మమనీ, తన తపము భక్తి పాడైనవనీ దుఃఖపడినది. అంతే కాదు- "ఎవడో దుర్మార్గుడు నా రత్నపూజలను చిమ్మివేసి, మారేడు కొమ్మలు తమ్మి కాడలు తెచ్చి తనపై పెట్టగా ఊరకున్నాడు శంకరుడు ! ఇక చెప్పుటకేమున్నది ? దైవము కూడ పగవారిపక్షమే అయినాడు" అని వాపోయినది. ఎట్టకేలకు ధైర్యం వహించి, దంతికృత పూజలు త్రోసివేసి- అనర్ఘ్య రత్నములతో శివుని పూజించినది. రేపుకూడా తనపూజ ఇట్లాగే వ్యర్థమైతే ఏం చేయాలి ? ప్రతిదినం తానుచేసిన శివపూజ వ్యర్థమవుతూ ఉండటంవల్ల కలిగిన చింతచేత ఆపాపతేనికి నాటిరాత్రి శివరాత్రి జాగరమే అయినది !

## 10

ఉనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయ రాజపుత్రినీ
ధనువు శిలోచ్చయంబు పురదాహా ! రథీకృత రత్నగర్భ ! నీ
మనమున కీశిలాశకల మండనమెట్లు ప్రియంబుసేసె ? నే
మనఁగలవాఁడ నిన్ను ?వ్రతహాని యొనర్చు దురాత్ముఁ డుండఁగన్

(2-122)

రత్నపూజచేసి, పాము వెడలిపోయిన తరవాత ఏనుగు వచ్చినది. నిన్న మొన్నటివలెనే శివునిమీద నానారత్నము.లుండటం చూసి కడుచిన్నపోయినది "నాతో ఇట్లా పంతగిస్తున్న వారెవ్వరో ? విశ్వపతీ ! ఈ నీలపు రాళ్లు నల్లగలువలా ? ఈ పచ్చ రాళ్ళు లేత బిల్వపత్రాలా ? ఈ ఎఱ్ఱరాళ్ళు విచ్చిన ఎఱ్ఱ దామరలా ? ఈ రాళ్ళలో పరిమళం, మెత్తదనం, చల్లదనం ఉంటాయా ? ఇవి నీకు ఎట్లా నచ్చినవయ్యా ?" అని వాపోయినది అంతేకాదు శివునిమీద కోపంకూడా వచ్చింది- "అయ్యా ! నీవు ఉండేది రాతిగుట్ట (కైలాసగిరి). నీ భార్య రాతిగుట్ట (హిమాలయం) కూతురు. నీ ధనుస్సురాతిగుట్ట (మేరుపర్వతం). నీ రథం రాళ్ళమయమైన భూమి. ఇంక నీవో

త్రిపురాలను కాల్చివేసినవాడవు? అంతటా జాళ్ళతోనే సంబంధంగల నీకు జాళ్ళతోడి అలంకారమే నచ్చింది కాబోలు! అయినా నిన్ను అనడానికి ఏముంది? నా వ్రతానికి హానిచేసే దురాత్ము డొకడు వేరే ఉన్నప్పుడు" అని క్రోధం వెళ్ళగక్కింది." సరే నేటికి అయినదేదో అయినది. రేపు వేళ తప్పించివచ్చి, నా పూజను పాడుచేస్తున్న వాణ్ణి కనుగొనగలిగితే అదృష్టవంతుడనే; వాడో నేనో తేల్చివేస్తాను. రేపుకూడా నా పూజ ఇట్లాగే పాడయి, శివునిమీద పాషాణాలుంటే ఇంక నా ప్రాణాలే అర్పిస్తాను. ప్రాణంమీద తీపుగల ప్రాణులకు బిరుదులూ, వ్రతాలు కల్యాణకరములు కావుగదా?" అని నిశ్చయించుకొని, యథావిధిగా శివుని అర్చించి ఏనుగువెళ్ళినది. ప్రాణలింగపూజకు కలిగే విఘ్నంవల్ల పుట్టిన చింతాజ్వరంతో ఏనుగుకు ఆరాత్రి గడవటమే కష్టమై పోయింది.

## 11

ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత
పట్టిన చెంగల్వబంతి యనఁగఁ
గాల విష్ణుం డంధకారదైత్యుని వ్రేయఁ
జరమాద్రి బడి పోవు చక్రమనఁగ
దినమహీరుహామునఁ దేజోమయంబుగాఁ
బండిరాలిన పెద్దపండనంగ
దివినుండి దేవదానవ యుద్ధరక్తార్ద్రమై
నేలఁ గూలురథాంగ మనఁగ
బద్మినీసంగమశ్రాంతిఁ బరిహరింప
నపరజలనిధి జలకంబు లాడఁబోవు
కరణి నెఱసంజ చందురుఁగావి పచ్చ
డంబు ధరఁ బెట్టి, భానుబింబంబు గ్రుంకె. (2-128)

"ఎప్పుడు తెల్లవారుతుందో? సహింపరాని విరోధవహ్ని ఏ విధంగా చల్లార్చు కోగలమో?" అని మనస్తాపంతో పొగులుతున్న కాళఫణికి, హస్తికి ఆ పగలు, రాత్రి క్షణమొకయుగంగా గడచినవంటే అతిశయోక్తిలేదు. వాటికి కాలం ఎంతభారంగా గడిచిందో సూచించటం కోసం, అసలు కథను విడిచిపెట్టి, పది పదకొండు పద్యాలలో సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయాదులను విపులంగా వర్ణించినాడు ధూర్జటి. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలో పరమరమణీయమైన ఘట్టం ఈ కాళ హస్తుల కథ!

ఈ పద్యం సూర్యాస్తమయానికి సంబంధించింది. అస్తమిస్తున్న సూర్యబింబాన్ని చిత్రవిచిత్రంగా ఉత్ప్రేక్షించినాడు ధూర్జటి — తూర్పుదిక్కు అనే వధూమణి విసరగా పశ్చిమదిక్కాంత పట్టుకొన్న ఎఱ్ఱనిబంతి; కాలమనే విష్ణువు అంధకారమనే దైత్యునిమీద విసరగా అస్త్రాద్రి వెంబడిపోతున్న సుదర్శన చక్రం; పగలుఅనే చెట్టున తేజోమయంగా పండి, రాలిపడుతున్న పెద్దపండు; దేవదానవ యుద్ధసమయంలో రక్తంతో తడిసి, దివి నుండి భువికి జారిపడుతున్న రథచక్రం – అన్నట్లుగా అస్తమిస్తున్న సూర్యబింబం గోచరిస్తున్నదట! అంతేకాదు, పద్మినీ సంగమంవల్ల కలిగిన అలసటను పోగొట్టుకోవటం కోసం పశ్చిమ సముద్రంలో జలకేళి చేయబోతూ కట్టుకొన్న కావిరంగువస్త్రాలను ఒడ్డు మీద పెట్టి సముద్రతీరంలో మునుగుతున్నట్లుగా ఉందట భానుబింబం! అస్తమిస్తున్న సూర్యుని ఇంకోఘట్టంలో రామాయణంలోని బంగారులేడితో పోల్చటం జరిగింది. (vi – 87).

కన్యాకుమారి అగ్రంవద్ద మూడుసముద్రాలు కలిసినచోటు మనోహరమైన ప్రదేశం; ఆ అగ్రంవద్ద అస్తమిస్తున్న సూర్యబింబం ఇంకా పరమరమణీయమైన దృశ్యం. అక్కడ కూర్చుండి, మబ్బులులేని సాయంవేళ అస్తమిస్తున్న సూర్య బింబాన్ని చూడగలగటం జీవితంలో మరపురాని ఒక మధురానుభూతి. ఆ సమయంలో సూర్యబింబం నిజంగా ఒక ఎఱ్ఱని బంతిలాగే, మెత్తిసిపోతున్న పండులాగే కనిపిస్తుంది; కావి బట్టలు ఒడ్డుమీద పరచినట్లుగానే ఉంటాయి. చిరస్మరణీయమైన రమణీయ దృశ్యాన్ని కళ్ళకుకట్టినట్లు చూపించగలిగినాడు ధూర్జటి. ఈ ఘట్టంలోదే చంద్రోద యానికి సంబంధించిన "ఉదయగ్రావము......"

ఎట్లాగైతేనేం, చివరికి సూర్యోదయమయింది.

పన్నగంబు గజము బలమునఁ జలమునఁ
బోరుచెట్లొ? శివుని బొందుచెట్లొ?
చూడవలయుననుచు వేడుకతోవచ్చు
కరణినంతఁ దోఁచెఁ గర్మసాక్షి (ii – 189)

ఈ కథా పర్యవసానం ఏమిటో అని సూర్యునికి కూడా కుతూహలంగానే ఉందిట. పన్నగం సూర్యోదయానికి ముందేలేచి, శివాలయానికి వచ్చింది. నిన్న తాను చేసిన పూజలేమికి చాలా కటకటపడింది. ఏది ఎట్లైనా శత్రువును పరిమార్చటానికే నిశ్చయించుకొని, మారేడుకొమ్మల తామరతూడుల మధ్య చిన్నరూపంతో అణగిఉంది. ఇంతలో ఏనుగు వచ్చింది. నిన్న తాను చేసిన పూజ చెడనందుకు ఎంతో సంతోషించి,

వెంటనే వెనుదిరిగి పోయింది. దాగిఉన్న పాము 'డాయకపోయెగాదాయ' అంటూ బాధపడింది. రానున్న కీడు ఎరుగని ఏనుగు అడవికిపోయి మెత్తని మారేడు కొమ్మలు మొదలగువాటిని సంగ్రహించుకొని, తిరిగివచ్చి, పాపతేదు హృదయశల్యంబైన నిర్మాల్యాన్ని తుడవటానికి తొండం సాపగా, తనపూజ ఫలించినదనుకొంటూ పాము, ఆ ఏనుగు తొండంలో దూరి, కుంభస్థలంచేరి బాధపెట్టసాగింది. ఆబాధ భరించలేక ఏనుగు 'కొండల్గూలంగ నెత్తిమొత్తుకొని, దిక్కుల్మట్ట గీపెట్టి' పామును వెడలనడుచుటకు పెక్కుఉపాయాలు అనుసరించింది, కాని సాధ్యంకాలేదు. అప్పుడు ఏనుగు "ఏనా చచ్చుట తప్పదిప్పుడు... తానుంజావక చంపనోపదు ఉరగేంద్రంబు... సరి చంపిచచ్చుట జనాహ్లాదంబు గాదా?" (ii - 149) అని నిర్ణయానికి వచ్చి, శివునిదిక్కై కుంభస్థలాన్ని కొండకువేసి కొట్టుకొన్నది. కుంభస్థలంపగిలి ఏనుగు మరణించింది; దానితోపాటే పామూ కూడా మరణించింది. మరణం దక్షిణకైలాసంలో, సువర్ణముఖరీ తటాన కావటంచేత కాద్రవేయ భద్రగజాలు రుద్రగణాకారాలు పొందినవి. వారి ప్రార్థన మన్నించి శివుడువారికి సాయుజ్యమిచ్చి, తనలో కలుపుకొన్నాడు. ఈ విధంగా సాయుజ్యం పొందిన పాము, ఏనుగులే శ్రీ-కాళ-హస్తిలోని కాళము, హస్తి.

ప్రియురాలిని విడువలేక శివుని సేవించటం మరచిన ఫలంగా కైలాసానికి దూరుడైన కాలనాగుడే ఈ కాలనాగము. మధాంధుడై, భవానివలన శాపం పొందిన హస్తి అనే ప్రమథాగ్రణి ఈ హస్తి. కాళహస్తుల కథలవలెనే మనోహరమైన ఇంకో కథ తిన్ననిది. అతడు 'శివునికి తన కన్ను సమర్పించి కైవల్యం పొందినాడు.

## 12

ఓ సామీ ! యిటువంటి కొండదరిలో, నొంటింబులుల్ సింగముల్
గాసింబెట్టెడి కుట్ర పట్టడవిలోఁ గల్లువ్విక్రీనీడ, నే
యాసం గట్టితి వేటిగడ్డనిలు ? నీవాఁ కొన్న చోఁ గూడు నీ
శ్శేసుట్టంబులు దెచ్చిపెట్టెదరు ? నీ కిందేటికే లింగమా ? (3-65)

పొత్తపినాటి విపిన భూమిలో ఉడుమూరు అనే బోయపల్లె ఉంది. అది సమస్త భోగభాగ్యాలకు పుట్టినిల్లు. దాని కధీశ్వరుడు నాథనాధుడు, వాని భార్య 'తందే'. వారికి అపురూపంగా పుట్టిన బిడ్డ "తిన్నడు". తిన్ననికి పుట్టుకతోనే అబ్బింది శివభక్తి పెరిగి పెద్దవాడై, పరివారంతో వేటకు వెళ్ళిన తిన్నడు, అలిసి నిద్రింపగా ఒక కల

వచ్చింది – సమీపంలో శివలింగమున్నదనీ, దానిని భక్తితో కొలువుమనీ ఆదేశించి నాడొక దివ్యపురుషుడు. నిద్రలేచి, ఎదురుపడిన ఒక అడవిపందిని తరుముకొంటూ వెళ్ళిన తిన్ననికి, ఆ శివలింగదర్శనమైనది. సంతోషముతో సాష్టాంగనమస్కారాలు చేసి, తిన్నడు చెప్పిన మాటలివి. ఆటవికసహజమైన అమాయకత్వం, ఆదరణ తిన్నని మాటల్లో పొదిగినాడు ధూర్జటి. "నాకుంజుట్టము తల్లిదండ్రులు జెలు ల్నాథుండు ఈ దైవమే, మీకిచ్చోపనిలేదు క స్తిపడగా, మీ పల్లెకుంబొండు" అని తిన్నడు వెంటవచ్చిన పరివారాన్నంతా పంపివేసినాడు "ఎన్నేండ్లనుంచో వస్తున్నాడీయడవిలోన ఒంటిగా మహేశుడు" అని నమ్మి, దొప్పలలో నంజుళ్ళుతెచ్చి శివుని కారగింపబెట్టినాడు. శివుడు కదలలేదు. "నీవారగింపకుండిన జీవనమేమిటి నాకు? నీ పదరాజీవములపై ప్రాణము విడుతు" అని తిన్నడు ఏడ్చినాడు. వాని మూఢభక్తికి శివుడు ప్రసన్నుడై, అత డందిచ్చిన కఱకుట్టు ఆనందంతో ఆరగించినాడు. ఈ విధంగా కానలో తిరుగుతూ తిన్నడు అనుదినం శివుని సేవింపసాగినాడు.

ఆ శివుని కులదైవంగా పూజించే శివబ్రాహ్మణోత్తము డొకడున్నాడు. తాను అలికి, పూసి. ముగ్గులువెట్టి, కై సేసిన గుడిలో ఎంగిలిమంగలంబుల దొప్పలుండుట కాంచి దుఃఖపడినాడు. ఈవిధంగా ఏడురోజులు గడిచేటప్పటికి ఆ బ్రాహ్మణుని సహనం నశించింది. అంతేకాదు, ఈ కశ్మలత నంతటినీ సహిస్తున్న శివునిమీద కోపం కూడా వచ్చింది –

> ప్రాఁతలుమీఁదగప్పినఁ గృపామతినోర్చితి; నీచుపొత్తునన్
> బ్రాతిమెయి మెసంగితివి; భక్తుడు కుంచెన బంపఁబోతి; మై
> పూఁత యొనర్చుకొంటి శవభూతిఁ, గపాలమునన్ భుజించి; తీ
> రోఁతలు పెక్కులుండ నివిరోయుదువేః యిఁక భక్తవత్సలాః (iii–100)

అంటూ ఎత్తిపొడిచినాడు. చివరకు, "నీకీపని ఇష్టమైతేకానీ, ఇట్లా ఎంగిలిమంగలం చేసే ఆ పాపాత్ముని నాకు తెలియజెప్పు. లేదా తిండిమాని ఇక్కడే ప్రాణం విడుస్తాను" అని శపించినాడు. అప్పుడు శివుడు ప్రసన్నుడై, శ్రుతివ్యవహారేతర మతమున మూఢ భక్తితో తిన్నడు చేస్తున్న పూజను గూర్చి ఆ బ్రాహ్మణునకు చెప్పి, "తద్భక్తి నీవును నేడు చూతువుగాని నావెన్కదిక్కునఁ గానకుండ నడఁగి యుండు"మని ఆదేశించినాడు.

తరువాత తిన్నడువచ్చి. యథావిధిగా నంజుళ్ళను సమర్పించినాడు; కాని శివుడు ఆరగింపలేదు. తిన్నడు పరిశీలించి చూచేటప్పటికి శివుని ఒకకంటి నుంచి నీళ్ళు కారు

తున్నవి. అందుకు తిన్నడు ఆందోళనపడి, పెక్కు మందులువేసి, ఫలితం కానక, పీదుమిక్కిలి ఆ కంటివెంట నెత్తురు కారటం చూసి భరించలేక, తన ఒక కనుగ్రుడ్డు పెకలించి దానిని శివుని కంటిమీద పెట్టినాడు. అది చక్కగా అతుకుకొని, మునుపటి కంటే మోహనంగా కన్పట్టింది. కాని, ఇంతలో రెండవ కంటినుంచి రక్తం కారటం మొదలయింది. అప్పుడు తిన్నడు - "స్వామీః నీ రెండవకంటికి నా రెండవ కన్నుంది; ఇంక నీ మూడవ కన్నుకూడా ఇట్లాగే అయితే నా ప్రాణమే ఇచ్చేస్తాను" అని చెప్పి, గుర్తుకోసం తనచెప్పు కాలిని రక్తం కారుతున్న నిటలాక్షుని కంటి కొనమీద పెట్టి, రెండవ కనుగ్రుడ్డును పెకిలింపబోయినాడు. అప్పుడు శివుడు సదయుడై ప్రత్యక్షమై తిన్ననికి, శివబ్రాహ్మణునకు వారు కోరినట్లు కైవల్యమొసగి తనలో కలుపుకొన్నాడు. కన్ను అర్పించిన ఈ తిన్నడే శ్రీకాళహస్తి చరిత్రలో ప్రసిద్ధికెక్కిన కన్నప్ప.

తపస్సుచేసి శివుని సాక్షాత్కరింప జేసుకొన్న అర్జుననకు ఆ జన్మలో పాశుపతాస్త్రం మాత్రమే లభించింది; మరి బంధుహరణమునకు కాంక్షచేసిన దానికి ఫలితంగా అర్జునుడు కలియుగంలో మృగహంతగా అంటే తిన్ననిగా జన్మించి, శివుని పూజించి, సాయుజ్యమందినాడు.

## 13

అడిగిన దిచ్చునర్థులకు, నా ప్తులకిచ్చుమనంబు, కూటమిం
బడతులకిచ్చు సౌఖ్యములు, బంధుజనంబులకిచ్చు సంపదల్
పుడమి సమస్త జాతులకు బొంకమి నుత్సవమిచ్చు, శత్రులన్
బొడవడఁగించి సాధుజనపుంగవ కోటికి నిచ్చు వేడుకల్ (3-147)

"ద్రవిడ కవిత్వ సరళి భారతీదేవి కెనయైన వార లెందఱైనఁ జోటిచ్చు, నొక్కరుండైన నతని కిచ్చుం దగినట్లు కూర్చుండ నెడము" అంటూ అగస్త్యమహర్షి పూర్వం పాండ్యభూపాలునకు ఒక నిర్మలిన శంఖఫలకాన్ని బహూకరించినాడు. దానిని ఆ పాండ్యరాజులు తరతరంగా పూజిస్తూ వచ్చినారు. కథాకాలంనాటికి ఆ సద్వంశంలో ఒక మహారాజు జన్మించినాడు. ఆయన ఆ సంస్థానంలో నక్కీరాది సత్కవీంద్రులు పన్నిద్దఱు ఉండేవారు వారంతా శంఖఫలకం మీద వసింపదగిన విభాసితమతులే, వారు మెచ్చునట్లుగా ఏ సరసుడు కవిత్వం చెప్పినా ఆరాజు చేసేత వేయేసి మాడలిచ్చేవాడట ఈ మహారాజు గుణాలను గూర్చి ధూర్జటి చేసిన ప్రశంస

ఈ పద్యం. నిజానికి ఏ రాజునకయినా ఉండవలసిన గుణాలు ఇవే - ఆ రాజు సత్కవులకే కాదు, అర్థులైన వారందరికి అడిగినది లేదనకుండా ఇచ్చేవాడు; ఆప్తులైన వారికి తన మనస్సు ఇచ్చేవాడు; భార్యలకు కూటమిని సౌఖ్యమిచ్చేవాడు; బంధు జనులకు సంపదలిచ్చేవాడు; రాజ్యంలో సత్యవ్రతపరాయణులైన సమస్త ప్రజలకు ఉత్సవం ఇచ్చేవాడు; దుర్జనుల నణచివేసి సజ్జనులకు వేడుకలు ఇచ్చేవాడు. 'బొంకమి'ని అంటే అబద్ధమాడకుండుటను ఆ రాజు ఎంతో గౌరవించేవాడన్నమాట; "సారపు ధర్మము, విమలసత్యము" అని తిక్కనగారు చెప్పినదానిలోని సత్యము ఇదే. 'సత్యమేవజయతే' అని భారత ప్రభుత్వం అధికార చిహ్నంలో గ్రహించిన సూక్తిలోని సత్యం కూడా ఇదే. మరి మానవాళికి మహితధర్మం ఇదేకదా!

## 14

తానెఱింగిన విద్య నృపా
స్థానములో నెఱపఁగీర్తి సమకూరుంగా
కే నరునకుఁ, బరవిద్యా
ధీనత భూపాల సభలఁ దేజము గలదే ? (3-162)

ఆ పాండ్యరాజ్యంలో ఒకసారి, దురదృష్టవశాన వర్షశూన్యమై,మానిసిని మానిసి తిను కఱవు వచ్చినది. దానిని భరించలేక మూలస్థాన హరద్విజుడొక డెందేని పోదలంపగా మహేశుడు దయతలచి, పాండ్యరాజుపై అఱవబాసలో శృంగారరసానవద్యంబుగా ఒక పద్యము చెప్పి ఇచ్చి నృపాస్థానంలో "ఇది చదివిన మెచ్చి వేయి మాడల ముడు పిచ్చు, వెచ్చంబున కొదవు, నీవు నెవ్వగన్నొవ్వక బ్రతుకం గలవాడవు; అంతట గఱవు దీఱు, జగంబున గృత వర్షంబగు వర్షంబు గురియం గలదు, సస్యంబులు పండు, పండువు జనంబులకవు" నని సాగనంపినాడు. అతడును రాజాస్థానమునకు బోయి, శ్రీ పరమేశ్వర ప్రణీతంబైన కవితాచమత్కారము వినిపించినాడు. అందులో 'సింధుర రాజగమనాధమ్మిల్ల బంధంబు సహజగంధంబు' అని ఉన్నది. వేనలికి సహజగంధ మేమిటనీ తప్పిది చెప్పరాదనీ నత్కీరుడు ఆక్షేపించినాడు. ఆవిప్రుడు చిన్నబోయి, "నా కప్పరమేశ్వరుండు వసుధాధిపుపై రచించి యిచ్చినాఁ డొప్పును దప్పు నే నెఱుఁగ నుత్తములారా!" అని చెప్పి, తిరిగివచ్చి, శివుని పద్యము శివుని కొప్పగించి చెప్పిన మాటవిని. "నిన్ను నమ్మిపోయి, నిండినసభ సిగ్గుచెడితి, మున్న కథలు చెప్పనేల?", "నిన్ను నమ్మి, పౌరుషగర్వము, బోనాడు కొంటిఁగతపట సభలోన్", "నీ మాట నమ్మి

పోయిన నా మోసము, జెప్పనేల ? నత్కీరునిచే నే మాటపడ్డ దుఃఖము జ్ఞామవ్యథ కొలఁదిగాదు. సద్భక్తనిధీ" అని వాపోయినాడు. అంతేకాదు-"తెలిసిన విద్యను నృపాస్థానంలో వెలయించినప్పుడు కీర్తివస్తుందిగాని, పరవిద్యాధీనత రాజసభలలో తేజస్సునిస్తుందా ?" అని నిర్వేదము చెందినాడు. చివరకు—

"నా భాగ్యం బిటు లుండఁగాఁ, దుది నీనున్నత్కీరునిందూఱఁ గా
నే భావ్యం ? బిఁకఁజాలు, నిక్కఅవుచేనిల్లైతి, నెందైనఁ గా
నీ భైక్షంబునఁ గుక్షిఁ బ్రోచుకొని, దీనిందీర్చి నేవత్తు, దే
వా ! భద్రంబగు నీకు, నన్ననుపవే ?" (3-165)

అంటూ ప్రార్థించినాడు.

రాజాస్థానంలో ఇటువంటి ఘట్టాలను ఎన్నింటిని చూసినాడో ధూర్జటి ? ఇట్లా భంగపడేవారు రెండు రకాలుగా ఉంటారు. "ఏదో చూసీ చూడకుండా తోసుకుపోదా ?" అన్న మొండి ధైర్యంతోవచ్చి, భంగపడేవారు ఒకరకం. హరద్విజునివలె అమాయికంగా ఎవరినో నమ్మివచ్చి, భంగపడేవారు రెండోరకం, మొదటిరకంవారు భంగపాటును లెక్కచేయరు. ఇంక రెండవవారికి అది మరణంతో సమానమే. అందుచేతనే "నా భంగపాటు వలన కలిగిన దుఃఖం ముందు జ్ఞామంవల్ల కలిగిన దుఃఖం కొంటగా"దని ఆ విప్రుడు వాపోయినాడు. మానధనులైన వారికి భంగపాటు ఎంత బాధాకరమో ? విప్రుని మాటలలో వ్యక్తం చేసినాడు ధూర్జటి, ఈ ప్రబంధంలో రమణీయమైన అనేక ఘట్టాలలో తప్పక పేర్కొనదగిన ఘట్టం నత్కీరునికథ.

## 15

ఈ రాజన్యుని మీఁద నేఁ గవిత సాహిత్య స్ఫురన్మాధురీ
చారు ప్రౌఢిమఁ జెప్పిపంప, విని మాత్సర్యంబు వాటించి, న
త్కీరుం డూరకె తప్పువట్టెనఁట ! యేదీలక్షణంబో, యలం
కారంబో, పదబంధమో, రసమొ ? చక్కం జెప్పఁడా తప్పనన్. (3-167)

తన మాట నమ్మి మోసపోయిన హరద్విజునిపై శివునకు అపారమైన దయ కలిగింది. "కటకట ! అన్నతీర్కుండట! కవితయు దప్పువట్టెనట ! అటు పదమీ ఎటువలెనో తెలిసెద" అంటూ నిటలాక్షుడు స్వయంగా కదలివచ్చి! కొలువు కూటంలో నిలిచి "నేనీ మహారాజుమీద సాహిత్యమంధ్రౌఢి మాధుర్యంతో కూడిన చమత్కార

పాటవంతో కవిత చెప్పి పంపగా అసూయతో నత్కీరుడూరకే తప్పుపట్టినాడట. ఏదీ ఇందులో తప్పు-లక్షణమా ? అలంకారమా ? పదబంధమా ? రసమా ?'' అని సవాలు చేసినాడు. నత్కీరుడు మునుపటివలెనే తప్పును పేర్కొన్నాడు. శివుడు ''గిరి తనయా ఘనకచభారము సహజగంధము కల''దన్నాడు ''అగజవిషయం నిజమైతే కావచ్చు, నీవు చెప్పిన పద్యం భూలోక స్త్రీ విషయం అందుచేత అది తప్పే. లూలాలాలపు మాటలింక చాలు'' అని నత్కీరుడు సమాధానము చెప్పినాడు. శివునికి కోపంవచ్చింది. తన నిజరూపం చూపిస్తే అయినా నత్కీరుడు అంగీకరిస్తాడేమో అని శివుడు నిటల నేత్రం చూపినాడు. నత్కీరుడు నవ్వుతూ-''తల చుట్టవాఱఁ గన్నులు గలిగినఁ బద్యంబు దప్పుగా దనవశమే ? వలదిచ్చట నీ మాయా విలసనములు పనికిరావు విడువు'' మని అధిక్షేపించినాడు. అతని శతత్వానికి కినిసి, ''కుష్ఠువ్యాధి పీడితుడవు కమ్ము'' అని శివుడు శపించినాడు. అప్పటికి కాని నత్కీరునకు తెలివిరాలేదు. ''స్వామీ ! ద్రోహము జేసితి'' నంటూ శరణు వేడి శాపాంతమును అర్థించినాడు. ''కైలాసశైలమును చూసి నప్పుడు ఆవ్యాధి మానగలదు'' అని శివుడనుగ్రహించినాడు. కుమారస్వామి కరుణవల్ల దక్షిణ కైలాస శైలమును (శ్రీ కాళహస్తీశ్వరుని) దర్శించి శాపంనుంచి విముక్తి పొంది నాడు నత్కీరుడు.

కవితాభిమానంతో నత్కీరుడు శివునికూడా లెక్కచేయలేదు. శప్తుడైనప్పుడు కూడా-''ఈ కవితాభిమానము వహించితి నేటికి ? శంఖపీఠికపై నీకవులున్నయట్లు వసియింపక దేవునితోడనేల చార్వాకమొనర్చితి ?'' అంటూ తలపోసినాడే కాని తాను చేసిన వాదం తప్పు అని అంగీకరించలేదు. అందుచేతనే శాపాంతంలో పరమేశ్వరుడే వానిని ''సాహిత్య శ్రీ వర !'' అనే అపూర్వమగు బిరుదముతో నత్కీరుని సమ్మానించి నాడు. ఇంక సర్వస్వాన్నీ పరమేశ్వర రూపంగా భావించి 'నవ్యభాషా శతధా నిగుంభన రసస్థితి నొప్పవలిర్ప' కవిత వెలయించిన ధూర్జటిని సహృదయులంతా ఆ''సాహిత్య శ్రీవర'' బిరుదంతోనే సన్మానించటం సమంజసం కాగలదు.

## 16

శివున పేక్షించిన చిత్తంబు, చిత్తజా
యత్తమై విటులపై నాసపడునె ?
పర శివస్తుతి కథాభాషలు విను వీను
లానునే కుంటెన లాడు పలుకు ?
విశ్వేశ్వర మూర్తి వీక్షింపఁ గోరెడు
చూ పన్యరూపంబుఁ జూడఁ జనునె ?
ముక్తివల్లభు ననురక్తిఁ గూడఁ దలంచు
కాయంబు గూడునె కాముకులను ?

హారుని భవహారు శ్రీ కాళహస్తి నిలయు
వినుతి యొనరించు జిహ్విక మనుజతతికిఁ
బ్రియముఁ జెప్పంగఁ బోవునె నయముమీఱ?
వార ధర్మోపదేశంబు వలదు తల్లి. (4-39).

ఈ పద్యంలో చివరిపాదం చూడకుండా ఉంటే ఇదేదో పోతన్నగారి రచనలాగే తోస్తుంది; అంతేకాదు, 'మందారమకరంద మాధుర్యమునఁదేలు మధుపంబు పోవునే మదనములకు' అనే పద్యంకూడా జ్ఞాపకం వస్తుంది. శ్రీ కాళహస్తిమాహాత్మ్యంలో చివరిది వేశ్యాతనయుల కథ, లోకోత్తర సౌందర్యవతులైన ఆవేశ్యాతనయలు—

ముట్టని చిత్తజాతుశరముల్ దెలిగన్నులు, రాజకీరముల్
ముట్టని పక్వబింబములు మోవులు, చన్నులు మిండతుమ్మెదల్
ముట్టని పుష్పమంజరులు మోములు రాహువు దంష్ట్రికాగ్రముల్
ముట్టని చంద్రుడు, వింతులువి ముట్టని లింగముల్.......

కాళిదాసమహాకవి 'అనాఘ్రాత పుష్పం ..' జ్ఞాపకం రాకపోదు ఈ పద్యం చదివినప్పుడు. వేశ్యాగర్భాన జనించినప్పటికీ ఏ జననాంతరవాసనవల్లనో వేశ్యా తనయలకు పుట్టుకనుంచీ 'పణ్యధర్మంబు మదిలోనఁ పట్టువడక శైవధర్మంబె ధర్మంబు' అయినది. అందుచేతనే పుండ్రేక్షుకోదండ విద్యారూఢ కాంతామతల్లి అయిన తల్లితో "వారధర్మోపదేశంబు వలదుతల్లి" అని వారు ఆక్రోశించినారు. అంతేకాదు—

ఒక్కనిఁ దల్పుమూల, మఱియొక్కనిఁ దల్లిగృహంబులోన, వే
ఱొక్కని బోటి గేహమున, నొక్కనిఁ జెల్లెలియింటిలోన, నొం
డొక్కనిఁ జుట్టముం బలె యథోచితచౌర్యరతి ప్రసక్తిమై,
నొక్కని నొక్కరుం డెఱుఁగకుండ రమింపఁగనమ్మ! నేరమే. (iv-40)

అని తెగేసి చెప్పినారు. అందుచేతనే ఈశ్వరుడు వారికి నిశ్శ్రేయసంబిచ్చి తనలో కలుపుకొన్నాడు.

ఇంతవరకు కథావశానవచ్చిన మేలి పద్యాలను పరిశీలించుదాం.

## 17

వడి, బిగువై నపీనకుచభారము వంక ధరిత్రి మోవకుం
డెడుతనువల్లితోఁ గటికి డెందము భూపతి దూలుచున్, పడిన్
వెడలు దృగంబు పూరములు వెల్లిగొనన్ బలవించె, దైవమున్
దడవుచుఁ, బంచమధ్వనుల తానము లీను పికాంగనాగతిన్ (1-5)

పరమేశ్వరుడు కపట జంగమ రూపుడై, జంగము రాలింటిలో విడిసినాడు. ఆమె యాదవభూనాయకు డారగింపబోయెడువేళ తానయి పళ్ళెరము నమర్చెడుచాన. ఆనాడు తపసి తగులమున ఆమె తన పని మరచినది. భూపాలునకు పట్టరాని కోపము వచ్చినది. ఆమెను పిలిపించి, నిర్దయచిత్త వృత్తితో తలగొరిగింప నాజ్ఞాపించినాడు. అట్లా ఆమె భంగపడి. ముండితమస్తకంతో, తపసి చరణాలపై పడి ఈవిధంగా విలపించినదట.

తెనాలి రామలింగకవి ఆక్షేపించినాడన్నట్లుగా ప్రముఖ ప్రబంధకవులు తమతమ కావ్యాలలో నాయికల ఏడ్పును సందర్భానుసారంగా వర్ణిస్తూవచ్చినారు. కాశీఖండంలో కళావతి ఉపాఖ్యానంలో, దైవోపహతయైన సుశీల ఏడ్పును శ్రీనాథుడు ఇట్లా వర్ణించినాడు.—

కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండచటఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోనలై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగాన్ (v-167)

అల్లసాని పెద్దనామాత్యుని వరూథిని—"వేదన నెపంబిడి యేడ్చెఁగలస్వనంబుతో" (మ. చ. ii. 70).

ముక్కుతిమ్మన్నగారి సత్యావధూటి "ఏడ్చె—బాల పల్లవ గ్రాస కషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనిన్" (పారి. i-138)

ఇంక రామరాజభూషణుని గిరికాదేవి- "ఎల్గెత్తి......ఏడ్చెఁ గిన్నెరవధూ రాజత్కరాంభోజకేళి విపంచికారవసుధాపూరంబు తోరంబుగన్" (వసు. iv-52)

మరి ధూర్జటి మాత్రం ఏం తక్కువ తిన్నాడు? పశ్చిరపుగోమలిచేత 'పంచమ ధ్వనులతానములీను పికాంగనాగతిన్' విలపింపజేసినాడు.

18

మొగలేటి మడుఁగున మునిఁగి తుండమ్మున
నుదక మాకర్షించి యూఁది యూఁది
కడుఁ గపాలముదాఁకి కలఁగంగఁ జిక్కఁగాఁ
జేసాఁచి జిట్టునఁజిఁది చిఁది
యిలమీఁదఁ దలవాఁక నీ ప్రక్క నా ప్రక్కఁ
బెడమర్లుగాఁ బొడ పెట్టి పెట్టి
యుడి వోని వేదన నున్నచో నుండక
పనిలేని పరువులు పాటి పాటి
పెద్ద మ్రాఁకులతోఁ గుంభపీఠ యుగముఁ
దోము కొనుచును జెట్టులు దూటి తూటి
పాము సేసిన దుఃఖంబు సామజంబు
దీర్చుకొను వెర వెఱుఁగక...... (2-148)

తుండంలో దూటీ, కుంభస్థలంచేరి, పాము పెడుతున్న బాధను భరించలేని ఏనుగు చర్యలను ఈ పద్యంలో వర్ణించినాడు ధూర్జటి. తుండంతో నీరు పీల్చు కొనటం, తుండంసాచి నీరు చిమ్మటం నేలమీదపడి ఇటునటు దొర్లటం, కుంభ స్థలంతో చెట్లనురాచుకొనటం ఏనుగునకు సహజ చేష్టలు. కాని వ్యధాభరితమైన ఏనుగు ఇది. అందుచేత ఈ చేష్టలుకూడావ్యధాభరితమైనవిగానే ఉన్నవి. అంతేగాక తరుగని బాధచేత, వెర్రెత్తినదానివలె పనిలేని పరువులు ఎత్తుచున్నదట! ఆ ఏనుగుపడన బాధను కనులకు కట్టునట్లుగా వర్ణించినాడు ధూర్జటి.

19

మాటలాడఁ దలంచి మఱచిపోయెడివారు
నడవఁ బోవుచుఁ దొట్రుపడెడువారు
నూరకుండెదమని యుండనోపనివారు
లేచెదమని లేవలేనివారుఁ
బనిలేనిపని బట్టబయలు దిట్టెడివారుఁ
బాడనేరకయును బాడువారు
నెదురైనవారికి నెల్ల మ్రొక్కెడివారు
వ్రీడావిహీనులై యాడు వారుఁ

జాలఁ ద్రావియు మగుడఁ జేసాఁచువారుఁ
దొడరి యుపదంశ భాండముల్ద్రొడుకువారు
నై రి మృగయాధి దైవతయాత్రయందుఁ
బానములుచేసి శబరదంపతులు రతుల. (3-41)

బాధతో మత్తెక్కిన ఏనుగు చేష్టలింతకుముందు వర్ణితములుకాగా, ఇందులో మదిరాపానంతో మత్తెక్కిన శబరదంపతుల చేష్టలు వర్ణితములైనవి. నవయౌవనమందడుగుపెట్టిన తిన్ననికి బహువిధమృగయావిహారముల తెఱగు ఎఱుకపఱుపవలయునని వనచరు లెఱుకతేనికి విన్నవించినారు. అందుకు తొలుత మృగయాధిదైవతమగు కాౖదేనికి జాతర చాటించినారు. ఆ మృగయాధి దైవతయాత్రయందు పానములుచేసిన ఆయా శబరదంపతుల చేష్టలను అతిసహజంగా వర్ణించినాడు ధూర్జటి. ఏదో మాటాడవలెనని తలచి అది మరచిపోతున్నారు. నడవబోయి తూలిపడుతున్నారు, నిశ్శబ్దంగా ఉందామనుకొనికూడా ఉండలేకపోతున్నారు, లేవవలెనని ప్రయత్నించికూడా లేవలేకపోతున్నారు, పనిలేకపోయినా ఊరకే ఇతరులను తిడుతున్నారు, పాడటం చేతకాకపోయినా రాగాలు తీస్తున్నారు, ఎదురుపడినవారందరికిని నమస్కరిస్తున్నారు, సిగ్గువిడిచి గంతులు వేస్తున్నారు, నిండుగా త్రాగికూడా మళ్ళీ చేయి చాపుతున్నారు. నంజుడు కుండలను ఒడిసి పట్టుకుంటున్నారు. అంతేకాదు ఒక శబరవనిత పేర్కొన్నట్లుగా "పుడిసెఁడు గాని లేదిపుడు పుచ్చుక త్రాగినమద్య, మింతలోనొడలెఱుఁగక" కొందఱుపడిఉంటున్నారు,

ధూర్జటికి రూపకోత్ప్రేక్షలెంత సులభములో స్వభావోక్తికూడా అంత సులభమే: అందున, ధూర్జటి రూపచిత్రములను చేష్టలను కన్నులకు కట్టినట్లు అలవోకగా చేయగలసమర్థుడు

## 20

ఎక్కడఁ బట్టినం గళలయిక్కువ, లెక్కడ నోరుసోఁకినన్
జక్కెరలప్ప, లేమనిన సారసుధారస, మెట్టు లుండినన్
జక్కఁదనంబు పెన్నిధులు, సంభ్రమమొప్పఁగ నేమి సేసినన్
మక్కువచెయ్వులై మెఱయు మన్మథకేళి యొనర్చునంతటన్ (1-48)

ఈ మహా ప్రబంధంలో శాంతము ప్రధాన (అంగి) రసం; ఇంక శృంగారం, వీరం, అద్భుతం, హాస్యం, కరుణం అనేవి అంగరసాలు. ఇందులోని వేర్వేరు కథలకు ఏకసూత్రత ఘటించినది శివభక్తి అని గుర్తించినాము. శివభక్తులు తమ సర్వస్వాన్ని శివార్పణంచేసి, తదైక్యాన్ని పొందుతారు; ఇది శాంతరసపరమావధి అంగరసాలన్నింటిలో ప్రముఖంగా చిత్రితమైనది శృంగారం. ఇది అంగిరసమైన శాంతమును మించినట్లుగా కనబడుతుంది ఇది లాక్షణికంగా దోషమైనప్పటికీ, 'కామిగాని మోక్షగామిగాడు' అన్నసూక్తి యథార్థమనిపించటానికో అన్నట్లుగా ధూర్జటి శృంగారాన్ని అధికంగానే పోషించినాడు — దాసి మిండ జంగములకథ, పార్వతీపరమేశ్వరుల విహారం వాణీహిరణ్యగర్భుల కథ, చెంచులు చెంచెతల విహారాలు మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. ఇట్లే స్త్రీల అవయవ వర్ణనలు కూడా బహుళంగా సాగినవి — ఇందుకు వేశ్యాతనయలకథ ఒక ఉదాహరణం. క్రీడాభిరామకర్త 'మకరధ్వజుని కొంప ఒకచెంప కన్పింప చీరగట్టినదయా చిగురుబోడి' అని వర్ణించగా, ధూర్జటి పూర్తిగా 'మరునిల్లు బయల్పడ' చేసినాడు (III-10).

దాసి-మిండ జంగముల సంభోగవర్ణనకు సంబంధించిన పద్యమిది. ధూర్జటి సాక్షాదీశ్వరుని మిండజంగముని చేసినాడు. ఆపైన దాసి తగులు కల్పించినాడు. అంతే కాదు వారి మన్మథకేళి విపులంగా వర్ణించినాడు; ఆ కేళిలో ఎక్కడ ముద్దు పెట్టుకొన్నా చక్కెరలప్పలట! ఏమి మాటాడినా సారసుధారసమట! శబర దంపతుల విహారాలను వర్ణిస్తూ "తేనియ తియ్యదనంబు సమానం బనదగునె యధర మధురిమ కెందున్" (8-14)అని కూడా తన నిర్ణయం చెప్పివేసినాడు. ఇదంతా పరిహాసప్రియుడైన తెనాలి రామలింగనికి ఒకమంచి అవకాశం కల్పించింది.

## 21

స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గెనో
యతులిత మాధురీమహిమ ? హా ! తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘనతాపహారి సం
తతమధురాధరోదిత సుధారస ధారలు గ్రోలుటం జుమీ.

ఇది ధూర్జటిని గూర్చిన చాటువు. దీనిని పుక్కిటి పురాణమని త్రోసివేయటానికి వీలు లేకుండా ఇందులోని సమస్యాభాగాన్ని, కుమారధూర్జటి గ్రంథస్థం చేసినాడు (కృష్ణరాయవిజయంలో. ఆనాడు రాజాశ్రయాన్ని అర్థించి, ఆ రాజు)

లకు తమ కృతులను అంకితం చేయని కవులు లేరంటే అతిశయోక్తి కాదు. కాని, ధూర్జటి, రాజాశ్రయంలో ఉండికూడా తన కృతిని నరాంకితం చేయలేదు. ఇందుకు కారణాలు వాని స్వతంత్ర ప్రవృత్తి, ఈశ్వరభక్తి, అద్వైత సాధన. ఈ కారణాల వలననే సాహితీ సమరాంగణ సార్వభౌముడు, సహృదయుడు అయిన శ్రీకృష్ణదేవరాయ లకు ధూర్జటి గౌరవపాత్రుడై, ''స్తుతమతి'' అయినాడు. 'నవ్యభాషా శతధానిగుంభన రసస్థితి నొప్పదలిర్ప'' చెప్పిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యాన్ని పరిశీలించిన తరువాత శ్రీ కృష్ణదేవరాయలు ఎంతో ఆనందం పొందాడు. ప్రసంగవశాన, సభలో, ''స్తుత మతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనో అతులిత మాధురీమహిమ'' అని అలవోకగా, సమస్యారూపంలో ప్రశంస చేసినాడు. సమయంకోసం ఎదురు చూస్తున్న తెనాలి రామలింగమునకు మంచి అవకాశము లభించింది. వెంటనే లేచి, గుట్టు తెలిసిన వాడువోలె-''......హా ! తెలిసెన్...అంటూ ఆ సమస్యను పూరించినాడు. ధూర్జటి పద్యంలోని "సుధారస"మునే గ్రహించి, కొంటెతనానికి పేరొందిన రామలింగమిట్లు చెప్పినాడు. రామలింగని సమస్యాపూరణంలోని చమత్కారాన్ని రాయలవారు, అట్లాగే ధూర్జటి గ్రహించి, నవ్వుకొని ఉంటారు.

కాని; పై సమస్యాపూరణ మాధారంగా, ధూర్జటి వేశ్యాలోలుడని అతని స్వభా వాన్ని గూర్చి ప్రవాదమొకటి లోకంలో వ్యాపించి ఉంది. పలువురు విమర్శకులీ విష యాన్ని విశ్వసిస్తున్నారు. ధూర్జటి కవితా 'మాధురీమహిమ'కు రామలింగము చెప్పినదే కారణమైతే "వారవనితాధర సుధారసధారలు గ్రోలిన మహానుభావులంతా మహాకవులే అయి ఉండవలసింది; మరిఅట్టి దాఖలాలు లేవు. అందుచేత ఈ ప్రవాదం సత్యం కాజాలదు పరమేశ్వర లీలలు అచింత్యాలనీ, అధములుకూడా పరమేశ్వరానుగ్రహానికి పాత్రులు కాగలరనీ నిరూపించటానికి పూనుకొన్నవాడు ధూర్జటి. అటువంటి కథలనే ఎక్కువగా ఎన్నుకొన్నాడు. తదనుగుణంగానే దాసి తగులముతో ప్రారంభించి, వేశ్యా తనయల ముక్తితో తన కథలను ముగించినాడు. కాగా, కథావశాన ప్రసక్తాలైన అంశా లను పురస్కరించుకొని, కవిశీలాదులను శంకించటం సమంజసం కాజాలదు. ఇంతకీ రాయలవారి ప్రశ్నలోని 'మాధురీమహిమ', తన కవిత్వసారంగా శతకంలో ధూర్జటి చెప్పుకొన్నదే :

## 22

శ్రీ విద్యుత్కలితాజవంజవమహాజీమూత పాపాంబు ధా
రావేగంబున మన్మనోబ్జ సముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా ! మీ కరుణాశరత్సమయమింతేఁ జాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా !

శ్రీ కాళహస్తీశ్వర శతకంలోని తొలి పద్యమిది. ప్రబంధముందా? శతకం ముందా? అనే మీ మాంసలున్నాయి. లోకాచారాన్నిబట్టి, అంటే కవితా సాధన సాధారణంగా శతకరచనతో ప్రారంభమవుతుంది కాబట్టి, శతకమే ముందరి రచన అని కొందరు విమర్శకుల అభిప్రాయం. కాని ఇది సమంజసంగా కనుపట్టదు. ధూర్జటి ఈ శతకంతో కవిత్వం ఆరంభించినాడంటే ఇది యౌవనారంభదశలోనే రచింపబడినది కావలెను. ఈ శతకంలో రాజదూషణ మితిమీరి ఉంది. ఇట్లా యౌవనోదయంలోనే ఏ అనుభవంలేకనే, రాజదూషణ నోరారచేసి, తరువాతి కాలంలో "కృష్ణరాయ కిరీట కీలితమణి గణార్చిత పదాబ్జ శ్రీ" వహించటం సంగతం కానేరదు. మహాత్మ్యం రచించే నాటికి ధూర్జటి కవితలో గొప్పవాడైనప్పటికీ, ఆధ్యాత్మికసాధనా విషయంలో ఇంకా పరిణత మనస్కుడు కాలేదనే చెప్పవచ్చు. అట్లుకాక పరిణత మనస్కుడే అయితే తన కృతి కన్యారత్నానికి తగిన వరుడెవ్వడని పరికించవలసిన అగత్యం కలిగేది కాదు. ఇంక శతకంలో "నీకుంగాక కవిత్వమెవ్వరికినే నీనంచు" శపథం చేసినాడు; ఇది పరిణత దశ. కాగా శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానంలో ఉండగానే మాహాత్మ్యాన్ని రచించి ఉంటాడు. ఇంక రాయల అనంతరం దేశంలో ఏర్పడిన కల్లోలపరిస్థితులకు క్షుభిత, హృదయుడైన ధూర్జటి శతకంలో ధూర్తులైన చిల్లరమల్లర రాజుల నా విధంగా నిందించి ఉంటాడు.

ఇంకొకటి కూడా సంభావ్యం కావచ్చు. ఈ శతకంలోని పద్యాలనన్నింటిని, ధూర్జటి పట్టుపట్టి, దీక్షగా కూర్చుండి, వరుసగా వ్రాసిఉంటాడనికూడా భావించనక్కర లేదు. అప్పుడప్పుడూ తాను ఆశువుగానో, సందర్భవశానో చెప్పినవికూడా కొన్ని ఇందులో చేరి ఉంటాయి.

సంపద అనేది మెఱుపు, సంసారమనేది పెద్ద మబ్బు, పాపాలు అనేవి వర్ష ధారలు, మనస్సు అనేది పద్మం. మెఱుపులతో కూడిన వర్షధారలవల్ల పద్మాల సౌంద ర్యం చెడినట్లే ధనమదంతో చేసుకొన్న పాపాలవల్ల మనస్సు చెడింది. శరత్కాలంలో పద్మాలు వికసించునట్టే, మీ కరుణఉంటే, అద్వైత భావనతో, తామరతంపరగా (పద్మ లతవలె అభివృద్ధి పొందుతూ) జీవిస్తాను—అని ధూర్జటి కాళహస్తీశ్వరునితో మొఱ పెట్టుకొంటున్నాడు.

## 23

ఏ వేదంబు పఠించె లూత ? భుజగం బే శాస్త్రము ల్చూచెఁ ? దా
నే విద్యాభ్యసనంబొనర్చెఁ గరి ? చెంచేమంత్ర మూహించె ? బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా ? కావు : మీ పాద సం
సేవాసక్తియె కాక జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా !

శ్రీ కాళహస్తీశ్వరుని కరుణ ఉంటే లభించవలెనే కాని చదువులవల్ల కైవల్యం లభిస్తుందా ? లూత ( = సాలె పురుగు) ఏ వేదాలను పఠించింది ? పాము ఏ శాస్త్రాలు తిరుగవేసింది ? ఏనుగు ఏ విద్యలను అభ్యసించింది ? తిన్నడు ఏ మంత్రాలను తెలుసుకొన్నాడు ? వీరంతా కైవల్యాన్ని పొందినవారేః ఈ చదువులు జ్ఞానాన్ని కలిగించలేవు. మీ పాదసేవాసక్తి ఒక్కటే జంతుతతికి తరణోపాయం—అంటున్నాడు ధూర్జటి, అంతేకాదు, "అంతామిధ్య తలంచి చూచిన......నిక్కంబంచు భ్రాంతించెంది చరించుగాని పరమార్థంబైన నీ యందు దా చింతాకంతయు చింతనిల్ప"ని వారిని చూసి ఆశ్చర్య పడుతున్నాడు. అందుచేతనే అటువంటి వారికి—

"దంతంబుల్పడనప్పుడే తనువునం దారూఢి యున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే
వింతల్మేనఁ జరింపనప్పుడె కురుల్వెల్లెల్లఁ గానప్పుడే
చింతింపన్వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా ?"

—అంటూ హితోపదేశం చేస్తున్నాడు.

## 24

వాణీవల్లభ దుర్లభంబగు భవద్ద్వారంబు నన్నిల్చి ని
ర్వాణ శ్రీఁ జెఱఁబట్టం జూచిన విచారద్రోహమో నిత్య క
ళ్యాణక్రీడలఁ బాసి దుర్దశలపాలై రాజలోకాధమ
శ్రేణీద్వారము దూఱఁ జేసితివిగా శ్రీ కాళహస్తీశ్వరా !

మోక్షలక్ష్మి బ్రహ్మాదులకు కూడా దుర్లభమైనట్టిది, అట్టి మోక్షలక్ష్మిని వశం చేసుకోవాలనుకొనటం ద్రోహమా ? అసలు, నేను ముక్తుడను కావటం నీకిష్టంలేదు కాబోలు ! లేకపోతే శాశ్వతమైన శుభాలను చేకూర్చే ప్రయత్నాలకు దూరమై, దురవస్థ

లకు లోనై, నీచులైన రాజులను కొలిచేటట్లు ఎందుకు చేస్తావు? నీ గుమ్మం ముందు నిలిచి. ముక్తి కాంతను అపేక్షించాను. అది ద్రోహంగా తలచి కాబోలు నన్ను నీచులైన రాజుల గుమ్మాలను ప్రవేశించునట్లు చేసినావు అని ధూర్జటి మొరపెట్టుకొంటున్నాడు శ్రీ కాళహస్తీశ్వరునితో. మాహాత్మ్యంలో "ఒక తప్పును కావరుగా నృపాలకుల్" (I-48) అంటూ రాజులను చాలా మెత్తగా ఎత్తి పొడిచినాడు ధూర్జటి, కాని శతకంలో సూటిగా రాజదూషణ చాలా అధికంగా చేశాడు. వారిని అధములనటమేకాక 'దుర్బీజ ప్రక్షేపాలు' అనికూడా అన్నాడు—

రాజన్నంతనె పోవు నా కృపయు, ధర్మం, బాభిజాత్యంబు, వి
ద్యాజాతక్షమ, సత్యభాషణము, విద్వన్మిత్ర సంరక్షయున్,
సౌజన్యంబు, కృతంబు నెఱుంగుటయు, విశ్వాసంబు, గాకున్నదు
ర్బీజ ప్రక్షేపలుగాఁ గతంబుగలదే శ్రీ కాళహస్తీశ్వరా.

ఉత్తమమానవునకు సహజధర్మాలు-కృప, ధర్మం, అభిజాత్యం, విద్యవల్ల సంపాదించుకొన్న క్షమ, సత్యభాషణం, విద్వాంసులను మిత్రులను పోషించటం, సౌజన్యం, కృతజ్ఞత, విశ్వాసం, మరి ఇవి అన్నీ 'రాజు' అనేపేరు రాగానే పోతాయా? అట్లా కాకపోతే ఈ రాజులు నీచులకంటె నీచులు కావటానికి కారణం ఏమిటి ప్రభూ? అంటూ ప్రశ్నిస్తున్నాడు ధూర్జటి.

## 25

వేధం దిట్టఁగరాదుగాని భువిలో విద్వాంసులం జేయ నే
లా? ధీచాతురి జేసెఁ, జేసిన గులామాపాటనే పోక తు
చ్ఛాబాధాదుల్ కలిగింపనేల? యదికృత్యంబైన దుర్మార్గు లం
జీ! ధాత్రీశులఁ జేయనేటి కకటా! శ్రీ కాళహస్తీశ్వరా!

దుర్మార్గులైన రాజులను సృష్టిస్తున్న బ్రహ్మమీద కోపం వచ్చింది ధూర్జటికి, సృష్టికర్త అయిన బ్రహ్మను తిట్టకూడదు; అది తప్పే, కాని ఆయన విద్వాంసులను ఎందుకు సృష్టించాలి? బుద్ధి వైభవంతో వారిని సృష్టించినాడుపో, వారికి ఆకలిదప్పుల బాధలను ఎందులకు కలిగించాలి? మరి ఆకలి దప్పులు తప్పనిసరి అయితే రాజులను దుర్మార్గులుగా ఎందుకు చేయాలి? రాజుల వింత ప్రవర్తనలు, విద్వాంసుల కడగండ్లు కళ్ళారా చూసిన ధూర్జటి ఒడలుమండి చెప్పిన మాటలివి. అంతేకాదు—

రా జర్థాతురుఁడై నచో నెచట ధర్మంబుండు ? నేరీతి నా
నాజాతిక్రియ లేర్పడున్ ? సుఖము మాన్యశ్రేణి కెట్లబ్బు ? రూ
పాజీవాళికి నేది దిక్కు ? ధృతి నీ భక్తుల్ భవత్పాదనీ
రేజంబుల్ భజియింతు రే తెఱఁగునన్ ? శ్రీ కాళహస్తీశ్వరా !

—అంటూ వాపోయినాడు. ధర్మపరుడు కావలసిన రాజే ధనవాంఛాపరుడైతే ధర్మం ఎక్కడ ఉంటుంది ? నానాజాతుల కార్యకలాపాలు ఏ విధంగా సాగుతాయి? మాన్యులకు సౌఖ్యం ఏ విధంగా లభిస్తుంది ? రూపాజీవాళికి దిక్కు ఏమిటి ? అంతేకాదు అటువంటి రాజుల పాలనలో నీ భక్తులు నీ పాదపద్మాలను ఏ విధంగా స్థిరచిత్తంతో పూజించగలుగుతారు ?

## 26

రాజుల్ మత్తులు, వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదులాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానలా
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీ కాళహస్తీశ్వరా !

ఒక భూపాలుడు పదునాలుగువేల యుగాలు పరిపాలన చేసినాడు; ఇంకొక ఆయుష్మంతుడు భూమినంతటినీ ఏకచ్ఛత్రంగా పరిపాలించినాడు. వీరి అభ్యుదయాన్ని గూర్చి పురాణాలు చెప్పటం వినలేదా ? వారేమి మూటగట్టుకొనిపోయినారు? అయినప్పటికీ గర్వంతో ఎందుకుమిడిసి పడిచస్తారో అని చిల్లరమల్లర రాజులను ధూర్జటి హేళన చేస్తున్నాడు. అంతేకాదు రాజు పేరుగల చంద్రుడు కళంక సహితుడైనాడు; రారాజు పేరుపొంది కుబేరుడు దుఃఖితుడైనాడు; ఆ రారాజు బిరుదునే వహించిన దుర్యోధనుడు సమస్త బంధుమిత్రులతో యుద్ధంలో మరణించినాడు; ఈ 'రాజ' శబ్దం చాలా నింద్యమైనది; ఇది నాకు జన్మజన్మలకూ వద్దు ప్రభూ ! అంటూ మోక్షాన్ని మాత్రమే అర్థిస్తున్నాడు ధూర్జటి. రాజులు గర్వాంధులు, వారిసేవ నరకయాతనతో సమానం. ఆ రాజులిచ్చే స్త్రీలు, పల్లకీలు, గుఱ్ఱాలు, అలంకారాలు మొదలైనవి ఆత్మకు బాధ కలిగించేవి మాత్రమే. వాటిని ఇదివరకే అనుభవించాను. ఇంక అవేమీ నాకు వద్దు. కేవలం జ్ఞాన సంపదఫలమైన మోక్షాన్ని మాత్రమే ప్రసాదించు అని.

## 27

కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు, వక్షోజముల్
రాయన్రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
ప్రాయం బాయెను, బట్టఁగట్టెఁదల, చెప్పన్ రోఁతసంసార, మేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁ గదవే శ్రీ కాళహస్తీశ్వరా !

ధూర్జటి వేశ్యాసక్తుడనటానికి ఆధారంగా కొందరు విమర్శకులు పేర్కొనే ప్రసిద్ధ పద్యమిది—వధూనఖాగ్రముల చేత శరీరము కాయలు కాసినదైనది. వక్షోజాల రాపిడి క్లేశాలతో, మోహంతో ప్రాయమంతా గడిచి పోయింది. తల బట్ట కట్టింది. సంసారం చెప్పటానికి రోతగా ఉంది. ఇంక నేను సంసారం చేయలేను. నన్ను విరక్తుని చేయవా ప్రభూ! అంటూ శివుని వేడుకుంటున్నాడు. ధూర్జటి ఇందులోని 'వధూ'శబ్దాన్ని ఈ విమర్శకులు గ్రహించినట్లు కన్పట్టదు. ఈ పద్యంలో చెప్పినదంతా స్వీయ భార్యా విషయమే కాని వారవనితా విషయం కాదు. అందుచేతనే భగవత్సాన్నిధ్యాన్ని కోరే ధూర్జటి సంసారమే జేయఁ జాలన్ అని చెప్పుకొనటం. అంతేకాదు. "ఆలుం బిడ్డలు దల్లిదండ్రులు ధనంబంచు న్మహాబంధనం బేలా నామెడఁగట్టినాఁడ" వని ఆక్రోశించినాడు. నిజమైన బంధువులెవ్వరో ఇట్లా వివరించినాడు.

> నీపైఁ గావ్యముఁ జెప్పుచున్నయతఁడు, న్నీపద్యముల్ వ్రాసి యి
> మ్మా పాఠంబొనరింతు నన్నయతఁడున్, మంజు ప్రబంధంబు ని
> ష్ఠా పూర్తిం బఠియించుచున్నయతఁడున్ సద్బాంధవుల్ గాక చీ
> చీ పృష్ఠాగత బాంధవంబు నిజమా ? శ్రీకాళహస్తీశ్వరా !

## 28

జ్ఞాతు ల్ద్రోహులు, వారుసేయు కపటేర్ష్యాది క్రియాదోషముల్
మాతండ్రాన సహింపరాదు, ప్రతికర్మంబించుకేఁ జేయఁగాఁ
బోతే దోషముగాన, మాని యతినై పోఁగోరినన్ సర్వదా
చేతః క్రోధము మానదెట్లు నడతున్ శ్రీకాళహస్తీశ్వరా!

ంసారంవల్ల కలిగేబాంధవ్యం బాంధవ్యం కానే కాదని చెప్పిన ధూర్జటి, వు లెటువంటివారో భంగ్యంతరంగా వివరిస్తున్నాడు- జ్ఞాతులు అంటే దాయాదు _న బంధువులు వట్టి ద్రోహచింత కలవారు. కపటంతో, ఈర్ష్యతో వారు చేసే పాప కార్యాలను సహించటం శక్యంకాదు, కోపంతో నేను తిరిగి ప్రతిక్రియచేస్తే మళ్ళీ నామనస్సే బాధపడుతుంది. అందుచేతనే విరక్తుడనై యతినై పోవాలను కొంటు న్నాను. అయినా నామనస్సులోని క్రోధం సమసిపోవటంలేదు. నేనేంచేయాలి ప్రభూ! అని ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వరునితో మొఱపెట్టుకొంటున్నాడు.

సంసారమింకవలదు, విరక్తునిచేయుమని ధూర్జటి ప్రార్థించినాడేకాని, మనస్సు వినటం లేదని స్పష్టమైంది. అందుచేత ముందుగా తన మనస్సు యొక్క తుళ్లను అణచి వేయుమని కోరుకొంటున్నాడు.

రోసీరోయదు కామినీజనుల తారుణ్యోరు- సౌఖ్యంబులన్
బాసీపాయదు పుత్రమిత్రజన సంపద్భ్రాంతి, వాంఛాలతల్
కోసీకోయదు నామనం బకట నీకుం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీని తుళ్ళణఁపవే శ్రీకాళహస్తీశ్వరా!

శ్రీకాళహస్తీశ్వరా! నా మనస్సు స్త్రీవిషయికమైన సౌఖ్యాన్ని ఏవగించుకొం టూనే మళ్ళీ కోరుతున్నది; పుత్ర, మిత్రజన సంపదమీది మోహాన్ని విడిచిపెట్టాలను కుంటూనే విడిచిపెట్టలేక పోతున్నది, కోర్కెలను తుంచివేయాలనుకొంటూనే తుంచి వేయలేక పోతున్నది; నీకు ప్రీతికలిగేటట్లుగా మంచిపనులు చేయాలనుకొంటూనే చేయ చేయలేక పోతున్నది. ఈనామనోగర్వాన్ని నీవు అణచివేయకపోతే నేను నిన్నుచేరు కోవటం కష్టం. కావున నేను విరక్తుడను కావటానికి ముందుగా దీని తుళ్ళణచి వేయక తప్పదు ప్రభూ!

## 29

జలకంబుల్ రసముల్, ప్రసూనములు వాచాబంధము వాద్యముల్
గలశబ్దధ్వను. లంచితాంబర మలంకారంబు, దీప్తుల్ మెఱుం
గులు, నైవేద్యము మాధురీమహిమగా, గొల్తున్ నినుం భక్తిరం
జిల, దివ్యార్చనగూర్చి నేర్చిన క్రియన్ శ్రీకాళహస్తీశ్వరా!

ఇంక, మహాకవి అయిన తాను శ్రీకాళహస్తీశ్వరుని ఏవిధంగా సేవించుకొన దలిచినాడో- ఈపద్యంలో వివరిస్తున్నాడు ధూర్జటి. అంతేకాదు, ఉత్తమ కవిత్వానికి సంబంధించిన అంశాలను కూడా ఇందులో తెలిపినాడు— జలకములు నవరసాలు, భవ్యాలు, వాక్యరచనలు, వాద్యములు మృదుపదాలవలన పుట్టిన| అర్థాలు, వస్త్రాలు అలంకారాలు (ఉపమాద్యలంకారాలు), దీపాలు, కాంతి మొదలైన గుణాలు, ఇంక నైవేద్యము నా కవితలోని మాధురీమహిమ. ఈవిధంగా నానేర్చిన పద్ధతిలో నీకు దివ్యార్చన సమకూరుస్తాను. నిజంగా కవితార్చన అలౌకికమైనదే; అందుచేతనే దీనిని దివ్యార్చన అన్నాడు ధూర్జటి. అంతేకాదు, ఇటువంటి కవిత్వం ''నాదుజిహ్వకు నైసర్గిక కృత్య"మని కూడా విన్నవించుకొన్నాడు. పైగా ''నీకేగాని కవిత్వమెవ్వరికి నేనీనంచు మీదెత్తితిన్, జేకొంటిం బిరుదంబు, కంకణము ముంజేఁగట్టితిం, బట్టితిన్ లోకుల్ మెచ్చ వ్రతంబు" అని నిష్కర్షగా, అసందిగ్ధంగా బాసచేసినాడు; తన సర్వస్వం శివార్పణం చేసినాడు.

ఈ పద్యాన్ని ఏదో సందర్భంలో ఆశువుగా చెప్పిఉంటాడు ధూర్జటి. కాగా తన కవిత్వసారం 'మాధురీమహిమఅని 'ధూర్జటే చెప్పుకొన్నాడామాటః దీనినే గ్రహించి "ధూర్జటి పల్కుల కేలగల్గెనో యతులిత మాధురీ మహిమ"అని శ్రీకృష్ణదేవరాయలు శమస్యా పూర్వకంగా ప్రశ్నించి ఉంటాడు.

## 30

నిను సేవింపఁగ నాపదల్పొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుండననీ మహాత్ముఁ డననీ, సంసార మోహాంబుపై
కొననీ జ్ఞానముగల్గనీ, గ్రహగతుల్ గుందింపనీ మేలువ
చ్చిన రానీ, యవినాకు భూషణములో శ్రీకాళహస్తీశ్వరా!

సర్వస్వం శివార్పణం చేసినవానికి కష్టసుఖాలు రెండూ సమానాలే. నిన్ను సేవిస్తున్నప్పుడు ఆపదలు వచ్చినాసరే, నిత్యకళ్యాణంగా ఉన్నాసరే, మోహం నన్ను ఆవరించినాసరే జ్ఞానోదయం కలిగినాసరే, గ్రహాలు వక్రించినా సరే, మేలుకలిగినా సరే- అవిఅన్నీ నాకు భూషణాలే ప్రభూ। అంటున్నాడు ధూర్జటి. వానినే సమదర్శి అంటారు. సమదర్శి పురుషోత్తము డనటంలో విప్రతిపత్తి ఉండదు. ఇటువంటి ధూర్జటికి నమస్సుమనస్సులుః

